కామగ్రంథమాల – ఆరవగ్రంథము.

# బ్రహ్మానందము.

బ్రహ్మానందశతకము

—గోపీనాథ వేంకటకవి.

రామావధూటితారావళి

—మాడభూషి వేంకటాచార్యుఁడు.

గణపతీయము

—ప్రాచీనకవి.

శప్పవిజయము

—తెనాలి రామకృష్ణుఁడు.

శృంగారశతకము

—తోఁట విజయరాఘవనాయఁడు.

1923.

[illegible] సంకలితము.] [వెల రు. 1–4–0.

Confidential: Subscribers' Edition.

# ప్రకాశకుని విజ్ఞాపన.

ఆనందమే, యథార్థబ్రహ్మస్వరూప మనియెడి యుపనిషత్సిద్ధాంత సారగ్రహణశీలు రగు తత్త్వజిజ్ఞాసువులకు, మే మీ యదనున నొనరించు కావ్యనివేదనము బ్రహ్మానందసంధాయిగా నుపచరింపఁ గలదను నుత్సాహావేశము మమ్ము జరితార్థుల నొనరించుచున్నది.

ద్రవిడకవిసార్వభౌముఁ డగుతిరువళువర్, తన నిబంధనమునందు, తృతీయ, చతుర్థ పురుషార్థముల నేకరాశిని జేర్చినాఁడు. ఆతని మతము, కామిగాక మోక్షకాముఁడు గాఁజాలఁడని: ఆతని యభిప్రాయముతో మేము పూర్ణముగ నేకీభవించుచు, మధురకవితాకాములకు, మోక్షలక్ష్మీకరావలంబన భాగ్యమునకు దోహదోపచారరీతుల, నీ బ్రహ్మానందమునం దుత్తమకావ్యరాజముల సంగ్రహించి సంకలన మొనర్చినారము. నిజమునకు, సత్కావ్యపఠనశ్రవణములన్న, వేంకటకవి నుడివినట్లు—'అరసి చూడ బ్రహ్మానంద మదియకాదె!'

ప్రత్యేకముగా గ్రంథారంభములందు భూమికాముఖమున, గ్రంథ ప్రశస్త్యమును, గ్రంథకారకల్పనాచాతురిని బృథక్తయా గ్రథన మొనరించి యుండినను, సంగ్రహముగా ప్రవేశికయందు నుపక్రమణవాక్యముల కావ్యరసికులకు హెచ్చరికఁ దెలుపవలసినబాధ్యత యున్నదనుకొందుము.

అత్యుత్తమరీతిని, మృదుమంజులశైలిని, నూటముప్పదిసీసములలో కామశాస్త్రసంప్రదాయములను గూలంకషముగా బ్రదర్శింపఁజాలిన పారమార్థికచింతనుఁడు, ఋషితుల్యజీవనుఁడు, వేంకటకవి: ఆతని కృతియగు బ్రహ్మానందశతకము కావ్యకన్యలకు శిరోభూషణము. అందువలననే యుచిత సత్కారముగా నీ కావ్యసంగ్రహమునందు నిదియే యగ్రస్థానమాక్రమించినది. —సర్వతంత్రస్వతంత్రుఁడై 'నిరంకుశాః కవయః' అను నార్యోక్తికి కవికాలంబున, నాధునికముగాగూడ నుదాహరణరూపములగు చర్యలతో మెలఁగిన వేంకటాచార్యుని 'రామావఘూటితారావళి' గాథసంభోగశృంగార

ప్రశంసల బిడియము నభినయించు, స్వీయనాయకులకు కర్ణపేయము గావింపఁగలదు. —'గణపతీయము' పురాణోచితమైన శైలీబంధమునఁ గడు ప్రౌఢపాకమున, కాళిదాసుని భావనకు వ్యతిరేకరూపమున నుమాసురతవర్ణన మొనరించెడి రసవత్కావ్యఖండము. ఇయ్యది సమగ్రముగా లభింపమి మాకైన యాశాభంగమున జదువరులకును పాలుగలదు. —ఇఁక 'శప్త విజయము'; జగమెఱిఁగిన బ్రాహ్మణుఁడుగదా రామకృష్ణుఁడు. ఆతని కావ్యవాణి స్వీయమనోనుకూలభావనల మెఱుఁగులు దేఱిన దీరచనముననే గదా.

'శృంగారశతక' మగునటుల, పంచాశత్పద్యయుగళమును రచించిన విజయరాఘవుఁ డంతప్రాచీనుఁడు కాఁడుగాని, ప్రాచీనుల కెవ్విధమునను దీసిపోవఁజాల దీతనికవిత్వము. —అనేకములగుకృతులు, రాధాకృష్ణ విహారేతివృత్తము నవలంబనముగాఁగైకొని యసంఖ్యాకములగు గేయముల రచియించి మిగుల బ్రఖ్యాతినందినవాఁడు. మధురనాయకరాజగు విజయరంగచొక్కభూపాలుఁడు రచించిన 'మదనార్ణవము'— తినఁబోవు వారికి రుచిచూపించినటుల పాఠకుల నుత్సుకులఁగావించి, ముందుప్రచురణమునకు మన్నననర్థించుటకై, యుదాహరణముగా నొకకథాభాగము మాత్రమే ప్రస్తుతము ప్రకటించుట కవకాశముగల్పించుకొనఁ గలిగినారము. మిగిలిన పదునాలుగుకథలును జమత్కృతియందు దీనికేమాత్రమును దీసిపోక, యొకదానికొకటి మిన్నగా జదువరుల నుఱ్ఱూత లూఁగించి, బ్రహ్మానందసిద్ధినొడఁగూర్పఁగలవనుట కించుకయు సందియముండదు.

మా గ్రంథమాలయందలి షష్ఠమప్రచురణమగు బ్రహ్మానందమును, పాఠకులుచితవిధంబున నాదరించి యెప్పటియటుల మమ్ముఁ బ్రోత్సహించెద రని విశ్వసించు.

10–6–1923,
పుదుచ్చేరి.

విద్వద్విధేయుఁడు,
యస్. చిన్నయ్య.

# భూ మి క .

క. శ్రీమానినీ మనోహర
సోమాన్వయ జలధి పూర్ణ♦సోమ జితారి
స్తోమ సమిద్ధ్భిమ పరం
ధామ సుగుణజాల శ్రీమ♦దనగోపాలా!*

—శ్రీరామభక్తుఁడగు భాగవతశిఖామణి కలలో గానుపించిన దేవుని యానతి మేఱకు, నవతారమూర్తిద్వయంబున కభేదాధ్యవసాయ సామరస్యంబున, యానుపూర్విం దొలఁగఁ ద్రోసి, మదనగోపాలదేవునకుఁ దా రచియించిన రామాయణంబును, ప్రభునానతిని సమర్పించి కృతార్థుం డయ్యెను.

గోపీనాథ వేంకటకవి స్వర్లోకవాసియై ముప్పది సంవత్సరములకు దాటదు. వైదిక బ్రాహ్మణుఁడు. నెల్లూరిమండలము నందలి, కావలి తాలూకా, లక్ష్మీపుర మీతని కభిజనపదంబు. వేంకటలక్ష్మీ పద్మనాభుల, దాంపత్యఫలము. ♦ ఈతఁడు పదియారేడుల వాఁడై యుండఁగ నొకతఱి నృసింహస్వామి యుత్సవముం జూచుటకై సింహపురంబునుండి, వేద శైలంబునకుఁ జని, యచ్చట నొక యోగివరేణ్యుని యనుగ్రహముఁ బడసి మంత్రరాజమహిమంబున సకలవిద్యలును గరతలామలకంబులు గాఁగ, కావ్యసుమంబుల నాంధ్రవాణి నర్చించుటకు మొదలిడెను.

'మూలమున కన్యూనాతిరిక్తంబుగా నాదికావ్యంబు దెలుఁగున వ్రాయుద మన్న పూన్కని దేవతానుగ్రహంబున నెఱవేర్చుకొని, కృతినాయకుం డెవ్వఁడు గానోపునని యాలోచన సేయుచున్న నెడఁ గలలో గానుపించిన దేవుని పల్కు లొదలఁ దాల్చి, యటులనే, రసికప్రభుండగు వెలుఁగోటి సర్వజ్ఞ కుమార యాచనరనాథుని ముగుదలను, రామా

---

*రామాయణ, ఆరణ్యపర్వము మొదటిపద్యము.

♦'శ్రీరామచంద్ర చరణారవింద మకరంద రసాస్వాదన తుంది లేందిందిరాయమాన గోపీనాథ కులపవిత్ర, కౌండిన్యగోత్ర, పద్మనాభసూరి పుత్ర, విద్యాసాంద్ర వేంకటకవీంద్ర ప్రణీతంబైన'— (రామాయణ గద్య)

యణంబును దన యిష్టదైవమునకు, లీలామూర్తి యగు కృష్ణున, కంజలితో గృతిగా నొసంగెను. అగ్రహారాది యథోచిత వివిధ సత్కారముల నంది, వేంకటకవి నాఁటినుండియు వేంకటగిరి సంస్థానముననే యునికిఁ గల్పించుకొనెను. పోషకుండగు మహారాజు మనవి నంగీకరించి, బ్రహ్మవైవర్త మందలి 'శ్రీకృష్ణ జన్మ ఖండము' నెనిమిది యాశ్వాసములఁ బద్యకావ్యముగా దెలిఁగించెను. రామాయణమునకును, దీనికిని నొక్కరే కృతినాథులు.

సర్వజ్ఞనాయని యనంతర మాతని కుమారుఁడు గోపాలకృష్ణయాచేంద్రుని, యాస్థానమునఁ గూడ నీ విద్వత్కవికి విశేషసన్మానము లభించుచుండినది. ఆతని కోరికపై మాఘకవివిరచితమగు శిశుపాలవధమును దెనిఁగించెను. అది, క్రీ. శ. 1886 సం॥రమున నని, కవియే జెప్పికొని యున్నాఁడు. ఎవరి ప్రేరణయునూ లేకుండగనే స్వాయముగ నీలోపున భగవద్గీతనుఁ గూడ దెలుగున వెలయింపఁ గలిగినాఁడు.

వంక లెన్నుటకు వలనుపడని యార్షజీవన మర్యాదా చరణుండైననూ, పండిన వయసునందుఁ గుమారప్రభుని వినోదార్థము కళాశాస్త్రప్రసంగములకు నిధిగా బ్రహ్మానందశతకముఁ గూర్చినాఁడు: లోకుల దృష్టిలో నా రచనము వేంకటకవి యంతటి పుణ్యమూర్తి తలపెట్టవలసినది కా దనవలసి యుండిననూ, ప్రజ్ఞా పరిణత మూర్తియగు, నమ్మహానీయునియెడ నది దోసఁగని తోఁచదు. 'ఇమ్మనుజేశ్వరాధము' లని గర్హించుటతోనే గ్రంథము మొదలిడిన పోతరా జంతటి వాఁడే, వేంకటగిరి ప్రభుని మెప్పించుటకై చిన్ననాఁటను చీఁకటిలో తప్పఁగా 'భోగినీ దండకము'ను జెప్పలేదా? వేంకటకవి విషయమున నంతటి ధైర్యముఁ గూడ లేదే! ఆతఁడు ప్రభువులను కారణంబుమాలి నిరసింపఁ బూనుకొనలేదు. వారి సమ్మానముల వలదని త్రోసివైవలేదు. అంతటి మాత్రము, పోలిపెద్ది వేంకటరాయాదులవలె, రాజసక్రీడా వినోదములం దవుల్కొని నిష్ఠను మాపుకొనలేదు. పారదారికాధికరణమును దన గ్రంథమునఁ జేర్చుకొనిన వాత్స్యాయనునికింబలే నీ పరమపూజ్యునకునూ నెట్టి న్యూనతయూ గలుగరాదు.

మనకు లభించు శతకము లన్నిఁటిలో, 'బ్రహ్మానందశతకముఁ' బోలినది గాని, ద్రాక్షాపాక రుచులలో, కైశికీరీతులలో నా కవిత్వము నతిక్రమించునది గాని, మఱియొక రచన గానరాదు. లావణ్యాశతకము, భళిరకటివేల్పుశతకము, తాళ్ళపాకవారి కృతులు— ఇవన్నియు నుచ్ఛృంఖల శృంగారోల్లసితంబు లయ్యునూ, నిటువలె శాస్త్రమర్యాదల వెలయించి, పాఠకుల సుఖవృగ కామాగమవేదులఁగా నొనర్పం గలుఁగునవి కావు. ఈ శతకమునకు దీఁటగునది మఱియొకటి లేదనుట యెంత మాత్రము నతిశయోక్తి కాజాలదు.

ఈ శతకము తెలుఁగునాఁట విశేషప్రచారంబు కలదిగా నుండినను నింతవరకును ముద్రణభాగ్యము నందుకొనకుండుట తెలుఁగుతల్లికి నపచారమైన దనవచ్చును. అనోట నానోటఁ బడి చివికి, పాఠములు మాఱి, పాదములు లోపములై కానంబడక పోవుచుండఁగా, శుద్ధప్రతి యే యొక్కచోట నేనిం దొరుకనన్న నాశయే నిఁకఁ గొంతకాలంబున కడియాస గావచ్చును.

మే మనేక వత్సరములనుండి ప్రయాస లెక్కింపక, 'బ్రహ్మానంద శతకము' ప్రతుల నెల్ల, లభించినంతవరకూ సమకూర్చుకొని, ప్రాంత భేదంబుల మూలంబుననైన పాఠాంతరంబులు, జతఁజేసి— సక్రమముగఁ బరిష్కరింపఁ జేసి నిర్దుష్టముగ, నిదే మొదటిసారి ముద్రించుచున్నాము. గుణదోషములను రసజ్ఞులగు పాఠకు లారసికొందురు గాక.

కామగ్రంధమాలా కార్యస్థానము,
పుదుచ్చేరి.

యస్. చిన్నయ్య.

—ముద్రితమై, యింత వరకునూ ప్రచారములో నున్న గోపీనాథ రామాయణ మొకటి తప్ప మిగిలిన కవికృతు లేవియూ నింతవరకును ముద్రణకు నోఁచుకొన లేదు.

9

శ్రీరస్తు.

# బ్రహ్మానందశతకము.

సీ. శ్రీమించు యోగీంద్ర♦సేవ్యమై ఖలుల కగమ్యమై లోకైక♦రమ్య మగుచుఁ
దనరార గోలోక♦మున రాసమండలి నభినవ క్రీడాగృ♦హంబులందు
విరజా తటంబున ♦ బృందావనంబున; గోగోపగోపికా♦కోట్లు గొలువ
వేడ్కతో నిత్యంబు ♦ విహరించు రాధికాకృష్ణు లొండొరులపై ♦ ప్రీతిపూర్వ
గీ. కముగఁ బరగించు నవసుతా♦కలితవీక్షణములు, వారల ప్రియభాష♦ణములు, సరస
[1]జారరతులు వెల్గోటి కు♦మార యాచభూవరేంద్రు నజస్రంబుఁ♦ బ్రోచుఁ గాత. 1

సీ. వరగుణశాలి స♦ర్వజ్ఞకుమార యాచక్షమానాథుండు ♦ సత్కళా వి
శారదుం డొకనాఁడు ♦ సంతోషమున గోపినాథ వేంకటకవి♦నాథు నన్ను
రావించి మన్నించి ♦ రమణ శ్రీకృష్ణునిఁ గోర్కెతోఁ గృతినాయ♦కునిగఁ జేసి
యతని విహారంబు ♦ లన్నియు శృంగార[2]శతకంబు సేయుము ♦ సరసఫణితి
గీ. నరయ నానందపరిపూర్ణుఁ♦డైన కృష్ణు చారుతర విషయానంద♦సరణు లెల్ల
నవ్య మృదు వాగ్విభూతి వ♦ర్ణనము సేయు టరసిచూడ బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. కామసంతృప్తుఁడు ♦ గానివాఁ డిల మోక్షకామి గాఁ డను గాథ ♦ గలిగియుండ
నదిగాక సురతభ♦వానంద మరయ బ్రహ్మానందలేశంబె ♦ గాని వేఱు
గాదు కావున మీరు ♦ గరిమతో మొదల శ్రీకృష్ణుండు వల్లవీ♦స్త్రీలఁ గూడి
చేసిన లీలావి♦శేషంబు లన్నియు శృంగారశతకంబుఁ♦జేసి ప్రీతి
నవల తదుక్త గీ♦తార్థసారం బంత సంగ్రహించి సమస్త♦సమ్మతముగ
గీ. నొక్క శతకంబుఁ గావింపు ♦ ముర్విలోన దేనియెడఁ బ్రీతిఁ గలవారు ♦ దానిఁ జూచి
తెలిసి సౌఖ్యవారాంబుధిఁ ♦ దేలు చుందు రంచితముగ బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. అని యిట్లు [3]కౌతూహ♦లాతిరేకంబున నాన తిచ్చిన యేను ♦ హర్షమొంది
హరి హర బ్రహ్మల ♦ నభినుతిఁ గావించి పద్మా శివా సర♦స్వతుల కెఱఁగి

---

పా. 1. భావతతులు   పా. 2. శతకంబుగాఁ జేయు
పా. 3. కౌతుకాహ్లాద వేగంబున

కరివక్త్రునకు నతిఁ ♦ గావించి వాల్మీకి సాత్యవతేయుల ♦ సంస్మరించి
కాళిదాసాది స♦త్కవులను గొనియాడి గరిమతో నాంధ్ర స♦త్కవులఁ దలఁచి
గీ. రాధికా మాధవుల విహా♦రంబులనిష్టి పూని శృంగారశతకం బుఁ♦గా నొనర్తు
సరసులందరు విని చాల ♦ సంతసింపుఁ డనఘులార! బ్రహ్మానంద ♦ మదియ కాదె. 4

సీ. గుణ దోషములు వర్ణ♦గణములు శబ్దార్థశుద్ధతల్ గని యతి ♦ ప్రాస బంధ
నియమంబు లెఱిఁగి యా♦న్నికకెక్కు మృదుమధురోక్తుల గదియించి ♦ యుక్తభంగి
నతి విపులార్థంబు ♦ మితపదంబులలోనఁ దెల్పియుంచి ముద్దుమా♦టలను గూర్చి
1విరళార్థ సంయుక్త ♦ సరళ శబ్దంబులు పొసఁగ నలంకృతుల్ ♦ పొందు పరచి
గీ. రసము చిలుకంగ 2వాచక ♦ రౌచకాది సప్తవిధ సత్కవీంద్రుల ♦ జాడ లెఱిఁగి
శౌరి లీలావిలాసముల్ ♦ సన్నుతింతు నరసి చూడ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 5

సీ. సచ్చిదానంద లక్షణ పరబ్రహ్మంబు మును విప్రయోగానంద ♦ మనుభవింపఁ
దలఁచి తా గుణమయ♦తనువుఁ గైకొని తన యోగమాయను రాధ ♦ గాఁగఁ జేసి
పరఁగ బ్రహ్మాండంబు ♦ బయల క్రీడార్థంబు గోలోకము సృజించి ♦ కోరి తనదు
కళలచే రాధికా♦కళలచే, గోప గోపికలను నిర్మించి ♦ సకలుఁ డగుచు
గీ. నందుఁ గ్రీడించెఁగాని చో♦నగుణుఁ డేల మోహనకిశోరరూపంబుఁ ♦ బొసఁగఁ దాల్చె
నట్టి కృష్ణుని శృంగార ♦ మభినుతింతు వరసి చూడ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 6

సీ. ధరలోన మనుజు లం♦దఱు మానుషానంద మందు సద్వాసక్తు ♦ లగుట వలన
తాను మానుషరూప♦ధారియై తగ మానుషానందమును బ్రీతి ♦ ననుభవింప
కరమర్థి తనదు శృం♦గారచారిత్ర ప్రపంచ మంతయు నాల♦కించి చాల
మనుగ సాధ్వాది తో♦షద ఘుటికా న్యాయమ్మున నిహపర సౌఖ్య ♦ మనుభవించి
ధన్యు లౌటకు మహా♦నన్యుండు గోలోకవాసియౌ కృష్ణుండు ♦ భాసురముగ
గీ. కోరి బృందావనంబున ♦ గోకులంబునందు విహరింప, మధురలో ♦ నవతరించె
నట్టి శౌరి విలాసంబు ♦ నభినుతింతు నంచితముగ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 7

సీ. కడునేడ్వ దేవకీ♦గర్భంబున జనించి ప్రాకృతబాలుని ♦ పగిది జ్ఞాన
వికసనంబులు లేక ♦ వెసఁ బరాధీనుఁడై సర్వోపచారముల్ ♦ సంగ్రహించు
టరయ 'నామాయ నా♦యంతవానికె యజ్ఞతయును బరాధీన♦తయును గలుగఁ
జేయు సామర్థ్యంబు♦చే నొప్పు నట్టి ద' యని యెఱింగించుట ♦ కంతెగాక

పా. 1. సరసార్థ  పా. 2. మదిని సం♦తసము పొంగ, సకల

గీ. తలఁప సర్వజ్ఞనకు నజ్ఞ♦తయును సర్వశక్తియుతునకు పారవ♦శ్యంబు గలదె
యట్టి కృష్ణుని చరితంబు ♦ లభినుతింతు నతులమైన బ్రహ్మానంద ♦ మదియ కాదె. 8

సీ. అరయ నెవ్వాని వీ♦ర్యంబున విరజకుఁ బుట్టిన తనయు లే♦డ్వురును సప్త
వనరాసులైరి ♦యెవ్వఁడు సృష్టిఁ గావింప రాధతోఁ గూడి సు♦రతము సేయు
తఱి మేనఁ బొడమిన ♦ తతఘర్మజలము బ్రహ్మాండముల్ నిండి యే♦కార్ణవంబుఁ
గావించె నట్టి జ♦గత్కర్త కృష్ణుండు జనని దోయిటనీట ♦ స్నపితుఁడగుచు
గీ. భక్తసుకృతోపచారంబు ♦ స్వల్పమైన నదియె సంతుష్టికర మని ♦ యన్నమాట
సత్యముగ జేసె నవ్విభు ♦ సన్నుతింతు ననుపమాన బ్రహ్మానంద ♦ మదియ కాదె. 9

సీ. దాఁటరాని భవాబ్ధిఁ ♦ దరియించుటకు తనగమ్య పాదాబ్జ మ♦రంద పాన
మదియ ముఖ్యోపాయ ♦ మనియు నాత్మీయాంగములలోనఁ దలపోయ ♦ మోక్షలక్ష్మి
కంఘ్రులే ముఖ్యంబు ♦ లనియును భక్తులకెఱిఁగించుటకె కాక ♦ యింపు మెఱయ
బంగారు తొట్లలో ♦ బవళించి కరముల చరణంబు వదనకం♦జమునఁ జేర్చి
గీ. మొనసి యంగుష్ఠ మానుట ♦ జననిపాలఁ దనివిదీఱక గాదట్టి ♦ యనఘమూర్తి
రమ్యలీలావిలాస వ♦ర్ణన మొనర్తు నరసి చూడ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 10

సీ. పశువులు శిశువులు ♦ ఫణులు గానరసంబు నెఱుఁగుదు రను వాక్య♦మెఱుకపరుప
గానంబు సర్వ దుఃఖంబుల నడచి జడంబులకైన సు♦ఖంబు నొసఁగు
ననునది ప్రకటింప ♦ నదిగాక, తా సామగానలోలుం డను ♦ గాథ తథ్య
మొనరింప జనయిత్రి ♦ యొఱపైన చికిలిబంగరు తొట్లలో నుంచి ♦ క్రమఫణితి
గీ. పాట పాడుచు నూఁచినఁ ♦ బవ్వళించి నేత్రముల మోడ్చి సుఖలీల ♦ నిద్ర బోయె
నట్టి శౌరి విలాసంబు ♦ లభినుతింతు నరసిచూడ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 11

సీ. వ్రేపల్లెలో నున్న ♦ గోపాలకుల నెల్ల నాఢ్యులఁ గావింతు ♦ నని తలంచి
పుడమి నకారణం♦బుగ సిరి నొసఁగిన నస్మదుక్తి విరోద♦మగును గాన
నెటులైన వీరి సొ♦మ్మింతైన చికిలైనను మెసవి సౌభాగ్యంబు ♦ నొసఁగుటొప్పు
నని వారి సదనంబు♦లందున్న వెన్నయు పాలు ముచ్చిలి మెక్కి ♦ భాగ్య మొసఁగె
గీ. నల కుచేలుండు గొనితెచ్చి ♦ నట్టి యటుకు లాడిసిగొని తిని యైశ్వర్య ♦ మొసఁగలేదె
యట్టి కృష్ణుని శృంగార ♦ మభినుతింతు నరసిచూడ బ్రహ్మానంద మదియ కాదె. 12

సీ. తను భక్తి ననిశంబుఁ ♦ గొనియాడు వారి కిప్పగిది నధీనుఁడ ♦ నగుదు నను
భావంబు తెల్లంబుఁ ♦ గావించుటకు ఱోల కరమర్థి తల్లిచేఁ ♦ గట్టువడియె

గానిచో యఘటన ♦ ఘటనా పటీయసి యగు తన మాయచే ♦ జగము లన్ని
కర్మవశంబునఁ ♦ గదలకుండఁగఁ గట్టివైచిన యా పర♦బ్రహ్మ మేల
గీ. యబల యగు తల్లిచే ఱోల ♦ నట్లు కట్టుబడియె నది చాల యనుకంప♦వలనఁ గాదె
యట్టి పరమేశు చారిత్ర ♦ మభినుతింతు నరసిచూడ బ్రహ్మానంద ♦ మదియు కాదె. 13

సీ. అవని గో బ్రాహ్మణు ♦ లనుచు విప్రులకన్న గోవుల మొదటఁ జే♦ర్కొనుట వలన
నావులు విప్రుల ♦ కన్నఁ బ్రాశస్త్యంబు గాంచిన వనియు ను♦త్కంఠతోడ
గోప్రదక్షిణమున ♦ భూప్రదక్షిణజాత ఫల మబ్బు ననియు నీ♦భావ మర్థి
నెల్లమానవులకు ♦ తెల్లంబు గావించుటకు కూర్మి గోపబా♦లకులఁ గూడి
గీ. ప్రేమమీఱ బృందారణ్య ♦ సీమయందు పసుల చుట్టును దిరుఁగుచు ♦ కసవుమేపె
నట్టిశౌరి విలాసంబు ♦ లభినుతింతు నంచితముగ బ్రహ్మానంద ♦ మదియు కాదె. 14

సీ. అనిశంబు తన్ను న♦మ్మినవారి యపమృత్యు కాలమృత్యువుల రో♦గములఁ బాపి
యఖిలాపదలడంచి ♦ యాపన్నివారకుం డనుమాట నిజముసే♦యంగఁ దలఁచి
యఘదైత్య వదనంబు♦నందు కాళీయహ్రదాంబు పానమున నీ♦రైన గోప
బాల గో గోవత్స♦జాలంబులను సుధామయ వీక్షణంబుల♦మనఁగఁ జేసె
నంతియ గానిచో ♦ నట్టి యాపద వారికేయెడ లేకుండఁ ♦ జేయలేఁడె
గీ. కర్మమును దాటఁ గాదను ♦ గాథ యితరజనములకె కాక నిజభక్త♦జనులఁ జేర
దనుట నిజము జేసిన హరి ♦ నభినుతింతు నరసి చూడ బ్రహ్మానంద ♦ మదియు కాదె. 15

సీ. హరి హర విధులు ని♦జాంశసంభూతులైనను తన యోగమా♦యను తరింప
లేరను యర్థంబు ♦ వారక వివిధ కారణములు లేకనే ♦ వ్రజకుమార
వత్సరూపంబులు ♦ వరుసతో సృజియించినట్లు విశ్వంబు నే♦పార సృష్టి
గావించు పటుశక్తి ♦ గలదను నర్థంబు క్షితిలోనఁ బ్రకటింపఁ ♦ జేయుటకును
గీ. అజుఁడు డాఁచిన బాల వ♦త్సాకృతుల ధరించి యొకయేఁడు మందలో ♦ సంచరించె
నట్టి కృష్ణుని శుభలీల ♦ నభినుతింతు నమితమైన బ్రహ్మానంద ♦ మదియు కాదె. 16

సీ. ఏఁటేటఁ గావించు ♦ నింద్రయాగమునకు సమకూర్చిన పదార్థ♦జాతమెల్ల
తనమాట నమ్మి శ♦క్రునకు నొసంగక యచలాకృతి ధరించి ♦ నట్టి తనకు
నిచ్చినందున నిర్జ♦రేంద్రుని వలన గల్గిన యుపద్రవ మణఁ♦గింపఁ గేల
గోవర్ధన నగంబు ♦ గోర్కెతో నెత్తి గోగోప గోపికలను ♦ గూర్మిఁ బ్రోచి

గీ. దైవతాంతరముల వీడి ♦ తనుభజించునతవి రక్షింతుననుచు తా ♦ నన్నమాట
సత్యముగ జేసె నద్దేవు ♦ సన్నుతింతు నంచితముగ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 17

సీ. ధరలోనఁ దా నవ♦తార మొందెడు వేళ తన యోగమాయఁ గ♦న్గొని సమస్త
జనులకు కామదా♦యినివయి యుండెదవీవు నిన్ను జనంబు♦లెల్ల పెక్కు
నామధేయంబుల ♦ నయముతోఁ గొలిచెదరని ప్రీతి నిచ్చిన ♦ ఘనవరమున
కనుగుణంబుగను కా♦త్యాయనిపూజలు చేయుగోపాలక ♦ స్త్రీల చేల
ములు గొనుటది వారు ♦ జలములో నగ్నలై స్నానంబు చేయు దో♦షము నడంచి
తనకర్థి మ్రొక్కించు♦కొని వారి పత్రిము స్వవశము సేయుటకె కా♦కతులితముగ
ద్రౌపదీదేవి తన్ ♦ దలఁచిన మాత్రాన పెక్కుచ స్త్రములు క♦ల్పించి యిచ్చి
గీ. నట్టి దివ్యప్రభావున ♦ కంబరములు లేక కాదు కామాసక్తి ♦ లీలఁగాదు
అట్టి యోగీశ్వరేశ్వరు ♦ నాదిదేవు నభినుతింతు బ్రహ్మానంద ♦ మనియ కాదె. 18

సీ. నూనూగుమిసాల ♦ నూత్నయౌవనుఁడును నలువొప్ప మధురగా♦నంబు సేయు
పురుషుండు తరుణుల ♦ కరయ వల్లభుఁ డంచు పలుమాఱు వేదంబు ♦ బలుకు నుడువు
నిజము సేయుటకు దా ♦ నిత్య కైశోర సుందర విగ్రహము దాల్చి ♦ సరస భంగి
భువన మోహనముగా ♦ మురళీ నినాదంబుసేయుచు గోపికా♦స్త్రీల కెల్ల
గీ. కలపు పుట్టించి మోహించి ♦ వారి తనదుకడకు రతికాంక్షఁ జనుదేరఁ♦గా మెనర్చు
నట్టి కృష్ణుని చరితంబు ♦ నభినుతింతు నంచితముగ బ్రహ్మానంద ♦ మదియ కాదె.19

సీ. తౌర్యత్రికము సుర♦తక్రియోద్దీపకసామాగ్రి యని గోప♦సతులఁ గూడి
రాసోత్సవము జేసె♦రహిగోపికల కందఱకు నన్ని హరిశరీ♦రములు దాల్చి
మించి సంక్రీడఁ గా♦వించి దా యోగీశ్వరేశ్వరత్వము నర్థి ♦ నెఱుకపఱచె
నేకకాలమున న♦నేక రూపములతో గోర్కెతీఱ ననేక♦గోపికలకు
గీ. వేడ్క నిధువన తృప్తిఁ గా♦వించి తనదుసర్వ సమతయుఁ దెలిపె నా♦శ్చర్య ఫణితి
నట్టి రసికాగ్రణి విలాస ♦ మభినుతింతు మదిఁదలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 20

సీ. లీల బ్రహ్మానంద ♦ లేశసన్నిభ రతిక్రీడాసుఖంబు లౌ♦కిక సుఖంబు
లందు ముఖ్యం బని ♦ యనుభవసిద్ధంబుగా నెఱింగి జనంబు ♦ దానిమీద
నమనస్కసిద్ధిచే ♦ ననుభవింపఁగ నర్హమైన బ్రహ్మానంద ♦ మాత్మలోన
నూహించి ఎగు యత్న ♦ మొనరించి కృతికృత్యులౌట కనేక గో♦పాంగనలను

గీ. గూడి గోలోక మందు గో♦కులమునందు వేడుకలు మీఱ నిధువన♦క్రీడ సలిపె
నట్టి కృష్ణుని శృంగార ♦ మభినుతింప నంచితముగ బ్రహ్మానంద ♦ మదియ కాదె. 21

సీ. [1]రణము గావింప నొ♦ల్లక విషాదంబు నొందిన యర్జునుని నిమి♦త్తీకరించి
సర్వోపనిష దర్థ♦సారభూతంబు సద్యోముక్తిదము మహా♦యోగి వేద్య
మైన గీతాశాస్త్ర ♦ మత్యంత కరుణచే కర ముపదేసించు♦టరసిచూడ
భావి కాల జనంబు♦భవబంధములఁ బాసి దోడ్తోడ ముక్తి నొం♦దుటకుఁ గాదె
గీ. యట్టి కంసారి సృష్టిర♦క్షాంతకారి భువన హితకారి గోపికా♦మోహకారి
శౌరి లీలావిలాసము ♦ లసన్నుతింతు నతులమైన బ్రహ్మానంద ♦ మదియ కాదె 22

సీ. అంతిమస్మృతి తన♦యందుఁ గల్గుటఁ జేసి చేదీశ కంస ము♦రాదులకును
సతతంబు భావించు♦కతన గోపికలకు నల నందునకు యశో♦దాదులకును
సకలధర్మంబులు ♦ చాలించి శరణంబునంటిన విజ యోద్ధ♦వాదులకును
మోక్ష మొసంగుట ♦ మొనసి గీతోక్తులు నిజము సేయుటకును ♦ నిఖిల సమతఁ
గీ. దవిలి లోకహితార్థమే ♦ యవతరించె నుర్వి ననునది తెలియఁ జే♦యుటకుఁ గాదె
యట్టి హరిలీల లన్నియు ♦ నభినుతింతు నార్యులార! బ్రహ్మానంద ♦ మదియ కాదె. 23

సీ. మథురలో నుండి య♦మ్మాధవుం డొకనాఁడు వ్రేపల్లెలో నున్న ♦ గోపికలను
రాధను యిళనును ♦ రతిరహస్యంబులు వారల లీలావి♦హారములను
రాసోత్సవంబు జ♦లక్రీడలను మఱి వారల నర్మసం♦భాషణములు
మనమునఁ దలపోసి ♦ మమత నిల్పఁగలేక యేకాంతసీమకు♦నింపు మెఱయ
గీ. నుద్ధవుని వేగ రావించి ♦ యుత్సుకమున నతనితో నెయ్యమునఁ బల్కె♦నట్టి శౌరి
విప్రలంభ శృంగారంబు ♦ విస్తరింతు నరసిచూడ బ్రహ్మానంద ♦ మదియ కాదె 24

సీ. ఒనర పిన్నటనాఁట ♦ నుండియు నా సోయగము, శరత్వాది భా♦వములు జూచి
ననుఁ గూడి క్రీడింపఁ♦బనిబూని వనిత లింపొసఁగ కాత్యాయనీ♦పూజ సల్పి
వరములు వడసి యా♦వ్వాల శరద్రజని వనంబులో మద్వేణు♦నాదము విని
పతి సుతాదుల వీడి ♦ బాళితో నాసద్దకరుదెంచి యే నీతు♦లాడ వగలు
గీ. మీఱ బ్రతుకాస మాని క♦న్నీరు గార 'నిన్ను నమ్మితి మ'న్న మా♦టెన్నుకొనిన
జాలి యగుచున్న దట్టి యో♦షల వలపులు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె

---

పా, 1. అని సేయనొల్లక ♦ నతిదుఃఖ మందు నర్జునుని దా హేతుభూ♦తునిగఁ జే

సీ. ఉత్సుకత్వమున న♦న్నొక నాఁడు పైకొన్న చెలికి లో మెండింపు♦వలన మిగుల
సౌఖ్యరూపక పరి♦శ్రమము బాటిలఁ జేయ తాళిలేనని యది ♦ తత్తఱమున
నక్కున వ్రాలి దా ♦ మ్రొక్కుచు కళనింప గమకింప నది చూచి ♦ కరములేను
బలు పిఱుందులకు లం♦కెలు వైచి చంద్రవాడికి రాపుఁ జేయుఁ ద♦ప్పక తనంత
గీ. చిలుచిలు మటంచుఁ గళ జాఱఁ ♦ జిక్కి "నీరుదక్కితిని యింక నన్ను గ♦దల్ప కుండు
మ"నుచుబతిమాలుకొన్న య♦వ్వనిత హాయులునుదిఁ దలంప బ్రహ్మానంద♦ మదియు కాదె

సీ. సమబంధ మొనరించు ♦ సమయంబునను పిక్కఁగళ లంటి చూచుకం♦బులు స్పృశించి
మొనసి పాదాంగుష్ఠ♦ములు మోపి పై కుబ్బి కాయజచ్ఛత్ర సం♦ఘర్షణంబు
గా రతిక్రియ సల్పఁ ♦ గనుఁగొని 'యిది యేమియాతురం బింతలో ♦ నకట తృప్తిఁ
గావించుటకు నీవు ♦ గమకించెద వటంచు కున్నొఘు చేసి నా♦కోర్కె తీర
గీ. రతి యొనర్చిన పిదప నీ♦లాటి పనులు సేయఁదగుఁ గాని యిప్పుడే ♦ సేయఁదగునె?'
యనుచు నను వేఁడుకొన్న య♦య్యబల సొంపు మదిఁదలంప బ్రహ్మానంద♦ మదియు కాదె.

సీ. సుదతి యొకనాఁడు నే♦ నెదురుగా గూర్చుండి మొనసి చేతులు వెన్క ♦ మోపి యుబికి
తగరుతాఁకుల కొంత♦తడవు మెప్పులు గాంచి యట మోహనమున నే ♦ నబ్జనాడి
మీటుచు మొనగంట♦ మెలఁత చన్మొనలు చక్కఁగ నొక్కి రసనచేఁ ♦ గదలఁ జేసి
యవ్వాల కెమ్మోవి♦ నానుచు చూచుకంబులు కరంబుల నంటి ♦ కళలు రేఁప
గీ. కదలనీయక చేత లిం♦గంబు బట్టి కమలశరు డోలికను కళో♦రముగ నూఁచి
కళను చిలచిలమని క్రుమ్మ♦రిలఁగఁ జేసి పరవశత్వము నొందిన ♦ పడఁతి సొగసు
మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియు కాదె. 28

సీ. మునుకొని గోబంధ♦మున నేను గూడిన నాతి హస్తము లుర్వి ♦ నూఁతఁ జేసి
కొని యెదు రొత్తుచుఁ ♦ దన నితంబము నెత్తి రహి నిల్వ పవన పూ♦రణము చేత
మరుగేహమున తర♦తర యను నాదంబు వెడల నే నవ్విన ♦ వ్రీడనొంది
తడయక లేవ నం♦తకు క్రిందుమన తలవంచి యూరులు బిగి♦యించి కదల
గీ. కున్నఁ గనుఁగొని దాని చె♦య్యొడిసిపట్టి పొలుపుమీఱంగ విరుల పా♦న్పునకుఁ దీసి
కలసి హాయి యొనర్చిన ♦ క్రమములన్ని మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియు కాదె. 29

సీ. తరుణి యొక్కతె నేను ♦ దిరునాళ్లతటి నలంకారము గావించి ♦ కౌతుకమున
వేడుక చూడంగ ♦ వెడలునప్పుడు రతిగావింప మనసైన ♦ గలయుటకు ను

పాయ మూహించి నై◆పథ్యంబుఁ జెడకుండ నొక కంబ మూనుక◆యుంటి నేను
పడఁతి నా తొడలపై ◆ పదము లుంచి కరాబ్జముల నాదు మెడకు సం◆కెలు ఘటించి
గీ. యేను చేతుల తన నడు◆మెత్తి పట్టుకొన నగారూఢమునఁ గూడి ◆ కోర్కె మీఱ
తనమనసు దీర్చుకొన్నట్టి◆దాని సొబగు మదిఁ దలంప బ్రహ్మానంద◆మదియె కాదె. 30

సీ. పూఁబోఁడి యెక్కటె ◆ పురుషాయితమున నీదగు శక్తిఁ జూతు నా◆యనుచు లేచి
చెలఁగి పైకెక్కి బస్కీలు చేయఁగ నెక్కుమాటు నే వంచించి ◆ మీఁటె తొలఁగ
నిడిన వంకర దిద్ది ◆ యెడనెడ నవ్వుచు నభిముఖంబుగ నుండి ◆ యంతమీఁద
ఘటచక్రిముగ నది ◆ కడువేడ్క తిప్పున తొలఁగి పోనీక వె◆న్కలకుఁ దిరిగి
గీ. కొంతసేపు రమించి దా ◆ నంతమీఁద మఱల నెదురుగ దిరిగి స◆మంబు గాఁగ
సుఖము గలుగంగఁ జేసిన ◆ సొంపు పెంపు మదిఁ దలంప బ్రహ్మానంద ◆ మదియ కాదె.

సీ. గ్రామ్యబంధమున నే ◆ రతిసేయు నిది జాణతనముగా దిఁక నీవు ◆ వెనుకఁ దిరిగి
నేర్పునఁ గ్రీడింప ◆ నిను మెచ్చుకొందునోయనఁగ నే నారీతి ◆ వెనుక దిరిగి
యురమును వంచించి ◆ యొప్పుగా దాని పిఱుందుల పై కొచ్చి ◆ యందములర
సరి జేసి సురతంబు ◆ సలిపిన "భళిర! నీయట్టి విదగ్ధుని ◆ నవని నెందు
గీ. నెఱుఁగ నింక సమంబుగాఁ◆దిరిగి కేళిసలుపు" మన నట్లు జేసి యా◆చెలికి తృప్తిఁ
గలుగఁ జేసిన నాఁటి కో◆మలి సుఖంబు మదిఁ దలంప బ్రహ్మానంద ◆ మదియ కాదె.

సీ. ఎలనాగయును నేను ◆ నిలువుటద్దములలో సొగసుగా నొకనాఁడు ◆ చూచుకొనుచు
పెక్కుబంధంబులఁ ◆ బెనఁగొని క్రీడించి యలసటఁ గొని సరి◆కళలు విడిచి
వరుసఁ గూర్చుండి యొం◆డొరుల చెమ్మట లార్చుకొనుచు "కళా విసర్జన మొనర్చు
టకు నిల్పుకొనుట కెం◆తయు సమర్థులమైన మనకు నిర్వీరకే సా◆మ్యంబు గాని
గీ. కళలు రతివేళ తమ యిచ్చ ◆ కొలఁది విడువనాగికొన నేర్పు లేని వా ◆ రవని రసిక
తములె?" యని లేమ యన్న యం◆దంపుమాట మదిఁదలంప బ్రహ్మానంద◆మదియ కాదె.

సీ. ప్రణయకోపమున నే ◆ బవళింప దగ్గఱి ముద్దాడ 'చాల్చాలు ◆ పొమ్మ' టంచు
విదలించి వైచిన ◆ 'విడతునా' యని మీసములు దువ్వి పైఁబడి ◆ కలియరాగ
నటు నిటు దప్పింప ◆ పటభూషణము లూడ్చి జట్టిపోరాటంబు ◆ సలుపుటకును
వదలక పైవ్రాలి ◆ కదలకుండఁగఁ బట్టి మకరధ్వజముఁ గొని ◆ మరునియింటఁ

గీ. జూనిపి పాలిండ్లు నా యెద♦ననిచి యదిమి కౌఁగిట బిగించి కెమ్మోవి ♦ కంద నొక్కి
తనిసి తనియించినట్టి చం♦దంబులన్ని మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 34

సీ. ఏనొక్క-నాఁటి రే ♦ యేమి గావించునో కలికి చూత మటంచుఁ ♦ బలుకకున్న
బహు చమత్కారముల్ ♦ బచరించి యంతకు నే బ్రసన్నుఁడ గామి ♦ నిశ్చయించి
తమిఁ జూపి 'యింత ని♦ర్దయుఁడ వైతి విదేల? యేమి సేయుదు నిఁక ♦ నీవు మున్న
తెలిపిన తెఱఁగునఁ ♦ దృప్తినొందెద' నని మఱునింట బహునాడి♦చర్చి మిందు
గీ. నాడి మన్మథచ్ఛత్రంబు ♦ గూడ మీటి మెదపి కదలించి కళ జార ♦ గదిసి నన్ను
కౌఁగిట గదియించినట్టి భో♦గక్రమంబు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 35

సీ. నలు వొప్ప నొకనాఁడు ♦ నాగరంబున నేను బెదఁగెడి తటి 'నాదు ♦ వింత నీవు
కను' మని చెలువ నవ్వ ♦ గదురంగ కడు పక్కళించి యూపిరి బిగి♦యించి చాల
ముక్కుచు మరుగేహ♦మున నున్న లింగంబుచేత నా శేఫ మ♦చ్చెరువు గాఁగ
మెడ బట్టి ద్రోఁచిన♦వడువున బయలకుఁ ద్రోఁచిన వెఱఁగంది♦ చూచుచుండ
యోనికవాటంబు ♦ నొయ్యన బంధించి 'యిది గట్టితనము గా♦దింక నీదు
ఘనతఁ జూతము గూడు' ♦ మన రోసమున శక్తి జూపి మెండిన యతి ♦ జోరకయున్న
గీ. హేళనము జేసి పదపడి ♦ కృప చెలంగ క్రీడ కవకాశ మొసఁగ నే♦గూడి యప్పు
డనుభవించిన సురత సం♦జనిత సుఖము మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.36

సీ. ఒక కాముకియును నే ♦ నొక్కనాఁ 'డే నెక్కుఁ డే నెక్కు' దని కర ♦ మేపుఁ జూప
సరి తారసిలి క్రీడ ♦ సలుపువో నాకు ముందుగ కళ జాఱిన ♦ మగువ నవ్వ
'యింత మాత్రమునకే ♦ యేల నవ్వెద' వని నేను గ్రమ్మరఁ గూడి ♦ దాని కళను
వెస వీడఁగాఁ జేయ ♦ నిసుమంత తాళు' మటన్న నే నవ్విన ♦ నవ్వేలంది
'నీ కట్లో నా కట్లు ♦ తెలిపి కూడుద' మన్న నే నట్లు గావింప ♦ నిటుల రోస
మలర కే యంతయు ♦ గలసి "పూరుషునకు తొర యైన నావృత్తి ♦ అరయ నధిక
గీ. మతివ కావర్తు లవి తక్కు♦వైన చిరపతనము గలిగుండు గావునఁ ♦ దలఁప తుల్య"
మనుచు సరసోక్తు లాడు కొన్నట్టి విధము మదిఁ దలంప బ్రహ్మానంద మదియ కాదె.

సీ. పరకీయ తోడఁ బం♦ల్కురఁ గూడుటను విడంబనము గ్గామి నేను ♦ ప్రథమ సురత
మందె జాగుగ జేసి ♦ యతివను కళ జాఱఁజేయు నుపాయంబు ♦ చింతఁజేసి

కూడుచు నిల్పి త♦త్కుచములు చుంబించి మఱి సేయు చేష్టెు ♦ మాటలకును
బెట్టుచు పగదాని♦దిట్టుచు "కొమ్మ! నీసౌందర్య మెంతని ♦ సన్నుతింతు"
ననుచు నీ యొడలు మె♦ల్లనఁ జూడ నిమ్మని యొఱపుగాఁ జూచుచు ♦ మఱలఁ గూడి
వెడలించి దానిపై♦బెట్టి తిట్టుచు గూడుచును వెన్క కటు దీసి ♦ 'వనజనేత్రి
గీ. యీఁకె పోటులు గనుమ'ంచు ♦ నిట్లు లేనివ్యాజముల నిల్పి నిల్పఁగా ♦ వలసినట్లు
జేసి చెలి కళ జారఁ జే♦సినవిధంబు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 38

సీ. చిఱుతప్రాయమున నే ♦ నెఱతనం జెలఁగఁ జతురతతోఁ గూడి ♦ చనువు మీఱ
నది చెంపఁ గొట్టుచు ♦ నటు గోరు బెట్టుచు వెఱపుఁ దెల్పుచు తొడ♦జెల్లమిడుచు
"తఱి యయ్యె విడువంగఁ ♦ దగ ద''ని వేఁడుచు "నింతయే నీ శక్తి? ♦ యింక విడవు
మ''నుచు దా కరమున ♦ నది బట్టి జొన్పుచు కౌఁగిట బిగియించి ♦ గారవించి
మొనపంటు నొక్కుచు ♦ మునుకొని శ్రమముచే నవమానముల కళ ♦ నాఁగికొనుచు
గీ. మొనసి యెడనెడఁ బురికొల్పు♦కొనుచుఁ గూడి సమత నిరువుర కేక కా♦లమున కళలు
జాఱఁ జేసిన చెలి చమ♦త్కారములను మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె 39

సీ. మఱి యొక్కనాఁడు నే ♦ మక్కువ నొకదాని స్మరశాస్త్ర నిగదిత♦స్థానములను
చుంబనం బొనరించి ♦ శృంగిబేరంబు చుంబనము జేయుచు లోని ♦ కొనర నూపి
రక్కింప గుజ్జని ♦ యొక్క నాదము బట్టి నే నవ్వ సిగ్గుచే ♦ నెంత లేవ
"తొలఁగిరి వే? మ''న్న ♦ తెలియక ననుమానపడి చీరకొంగున ♦ దుడిచిచూడ
నా తమ్మలపురంగు ♦ నలువుగాఁ గనుపింప చెఱఁగు మాసినదని ♦ చెలియ తొలఁగి
గీ. శిరము వాంచిన తత్వంబుఁ ♦ దెలియఁ జెప్పి తల్పమునఁజేర్చి కూడి యి♦ద్దరము సౌఖ్య
మంది ముదమున నవ్వుకొ♦న్నట్టి విధము మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. పడఁతి నేనును గత♦వసనులమై లేచి మార యుద్ధమునకుఁ ♦ దారసిల్లి
కలబడి పోరి నే ♦ కాలడ్డమిడి దాని బడద్రోచి పైనెక్క ♦ పదముచేత
తొలఁగఁ ద్రోయుచు నది ♦ తోడ్తోడ పైకొని కుదియఁ బట్టిన నేను ♦ కొప్పు లాగి
పార్లించి కూడరా ♦ పోటు దప్పించుక కాళ్లు కత్తెరవేసి ♦ గరిత ముందు
కొగి నిగ్గి పైకి లే♦వఁగఁ బోవ బొమ్మలుబట్టి నే పడఁద్రోచి ♦ పైకి నెక్కి
యదిమి పట్టిన వేగ ♦ నదియు నా సిగఁ బట్టియీడ్చి చెక్కులు గొట్టి ♦ యేపుమీఱ
పక్కకు పార్లించి ♦ పైకెక్కి చేత లింగము బట్టి నను చాల ♦ గాసిపఱచి

గీ. తరుణి నొప్పించి యొప్పించి ♦ తానుగూడ 'నబల సబలాయె' నంచు నే ♦ నభినుతింప
నాతి యుపాంగి చేసిన ♦ నాఁటి రతులు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. వగలాఁడి వగరుచే ♦ బిగువు గల్గఁగ జేసికొని రాగ నే జొన్పి ♦ వనితఁ జూచి
వగరుచేత రవంత ♦ బిగువుండు నొక్కింత చెమ్మగిల్లిన నది ♦ యిమ్మఁ జూపు
రతిలోనఁ దగ నిర్ద♦అకును మంటని జూపి బిగువుకు నే నొక్క ♦ వెరవుఁ జెప్ప
సక్థిద్వయము జేర్చి ♦ సాచుక పవళింప నిరుదెస కాళ్లుంచి ♦ యేను మీఁదఁ
గీ. జేరికూడి బిగువుఁ జూపి ♦ 'చెలియ సంవృతోరుబంధం బిది' యటన్న ♦ 'నౌర వింత
నేర్పితి వ'టంచు మెచ్చిన ♦ నెలఁత మాట మదిఁ దలంప బ్రహ్మానంప ♦ మదియకాదె.

సీ. అతివ యొకర్తు నే ♦ నన్యోన్య పాదముల్ ప్రక్కను దల లుంచి ♦ పవ్వళించి
యెదురుగాఁ దిరిగి మే ♦ మెడమకాళ్లటు సాచి తలగడల్ చేసి కిరిఁ♦గులకు వామ
కరములు సాచి పై♦కాళ్ల సందులకుఁ బోనిచ్చి కొంచెము వంచి ♦ యిలను పదము
లానించి దక్షిణ♦హస్తంబు లటు మోడ్చి పృథివిపై మోపి యొ♦క్కింత యుబికి
సరిఁ జేసి సెసఁ జొన్పి ♦ జాఱిపోకుండ ఖబర్దారుగా వింత ♦ పరిఢవిల్ల
గీ. చెలువు మీఱంగఁ గూడి ఖు♦షీని జెంది "నీవె సరి! నీవె సరి!" యని ♦ నేర్పు మీఱ
యిరువురము మెచ్చుకొన్న యా♦నెఱతనంబు మదిఁదలంప బ్రహ్మానంద♦మదియకాదె

సీ. ఒకరాత్రి నేను డ♦ర్పకయుద్ధమున లెక్క సలుపుచు ఘడియలు ♦ జరిపి నిలిపి
జాములు వెడలించ ♦ సరి నాకు సంతుష్టిగాకున్న చెలి నన్నుఁ♦గాంచి "మందు
మహిమయో! మణి మణి♦మంత్రంబులోఁ లేక తంత్రమో! యీవింత ♦ ధరణి నెందుఁ
గన్నది విన్నది ♦ గా దింక తాళలేన"ని యొక్కచే పాద ♦ మవలిచేత
గీ. చుబుకమునుబట్టి ప్రార్థింపఁ ♦ జూచి కళను తత్క్షణ మెడింప 'నూర్ధ్వరే♦తస్కుఁడవ'ని
వనిత శాబాసుగిరి యొసం♦గిన పసందు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె 44

సీ. పడఁతిని యొక నాఁడు ♦ పరిహసింపఁ దలంచి సమరతిఁ జేయుచు ♦ క్షణము నిలిపి
లలి తర్జనీ మధ్య♦ముల లోని కటు జొన్పి యూర్ధ్వ భాగంబున ♦ నున్న సలిల
నాడిక కదలించి ♦ నలువొప్ప ముందుకుసారిన యొంకేలు ♦ జాఱ నవ్వి
'తోయజానన లిట్లు ♦ సేయుదురా?' యని పరిహసింపఁగ వక్త్ర♦పంకజంబు
గీ. చిన్నబోవ దిగ్గున లేచి ♦ చీర ముడిచి "యౌర యిది యేమి యాగడ"♦మంచు కలశ
మందుకొని సందునకుఁ బోయి♦కట్టి కాయలు మదిఁదలంప బ్రహ్మానంద♦మదియకాదె.

సీ. మఱి యొకనాఁడు స♦మర్త ప్రాయముదాని మొలకచన్నులు గల ♦ ముద్దులాఁడి
నెలమిలోఁ ఫలదాన♦ముల సొమ్ములను మేలిమాటల చేష్టల ♦ మరులు కొలిపి
విరుల శయ్యకుఁ దార్చి ♦ వివృతోరు బంధ క్రమంబున సారెకు ♦ మరునిసిడము
దగిలించి చెమ్మగి♦ల్లఁగఁ జేసి లోని కంగుళిఁ జొన్పి సులభంబుఁ ♦ దెలియబఱచి
పెస మేహనము మీఁది ♦ ముసుఁగు ముంపటికటుబోఁద్రోచి జొనిపిన♦ముసుకు ప్రక్క
లాని వెన్కకు రాగ ♦ నది ముందఱకుఁ బోవ కవ్వున నొప్పిచే ♦ కేక వేయ
గీ. కదలకుండఁగఁ బట్టి 'యో♦కలికి! యింక నొప్పి లేద'ని యభయంబుఁ ♦ జెప్పి చెప్పి
కలిసి యభ్యాస పఱచిన ♦ కౌశలంబు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 46

సీ. పచ్చి పఠాని రూ♦పముఁ దాల్చి కైసేసి తెచ్చిన నెలలేని ♦ తేజి నెక్కి
బాజి ఖావా ఫుడాన్ ♦ వరుస నడువంజేసి చెలికాండ్లు వెంబడిఁ జేరి "యార
శాబాస"నంగ నే ♦ స్వారి బోవఁగ నొక్కయువతి దా కిటికీల♦నుండి చూచి
కడు మోహమున 'నాదు♦కడకిపు డేతెంచి యొకమాట విని బోవు♦టొప్పు' ననుచు
కబురు పంపిన నేను ♦ కడు వేడ్కఁ బోయిన పైఁబడి కౌఁగిటఁ ♦ బట్టి నిలిచి
క్రీడఁ గావించి ము♦ద్దాడి 1బాళినిగొని దృష్టి దాఁకునో యంచు ♦ తిరుగ సెల వొ
గీ. సంగి 'యల దాని వీధికి ♦ జనఁగ నింకవలదు సామి నాయొద్దకే ♦ వచ్చుచుండు'
మనుచు జవ్వని ప్రార్థించి♦నట్టి నెనరు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 47

సీ. పరఁగ హిందుస్థాని ♦ దిరిసు వేసుక జరీతాజు ధరించి ఝూ♦కా జెలంగ
చాలఁగా నాల్గు తే♦జీలఁ బూన్చిన రథమెక్కి నా చెలికాని ♦ యెదుర నుంచు
కొని రాత్రి చేసిన ♦ పనులన్నియును జెప్పుకొనుచు నే నా హర్మ్య ♦ మొనర నెక్కి
కనుఁగొని యొక తన్వి ♦ కళ చెఱుక్కన లోనకలకబాఱి చెమర్ప ♦ నిలువలేక
తొడలు కంపము నొంద ♦ నడుకుచు రాత్రికి తన వంతు గాకయుం♦డినను 'మమత
గీ. నిలుపగాఁ జాల నేఁడె రా♦వలయు' నంచు బాలకునిచేత నొకచీటిఁ ♦ బంపి పిలువ
నంపి ననుఁగూడి క్రీడించి ♦ నట్టి సొంపు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. నెఱజాణతోఁ గూడి ♦ సురతాంతమున నిల్పి కౌఁగిట నదిమి నే ♦ కళను విడువ
నది చూచి "యిది యేమి ♦ యాతురం' బని నాకు కడు నేగ నుద్ధతిఁ ♦ గలుగఁ జేసి

ఫా. 1. భళాయని

పైకొని పలుమాఱు ♦ బస్కీలు సేయుచు పరఁగ మత్కాళీ కల్క ♦ బాఱఁజేసి
స్ఖలన వేళను గ్రీడ ♦ నిలుపకఁ గావించి తుది నందులోఁ జాల ♦ తోరయ జూప
గీ. నిలిపి కళలను విడిచిన ♦ బలు సుఖంబుకన్న శతగుణితానంద ♦ మనుభవించి
యబలను నుతించి యది మొద ♦ లటులచేసి ముదము గంట బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. విను పూర్వ సంకేత ♦ మున నేను సందు గోడల మఱుంగున పొంచి ♦ దలఁగ కుండ
నను సైగఁ జేయ మె ♦ ల్లన తల్పుచాటున నీవలావల నిల్చి ♦ యింటివార
లిసుమంత వినకుండ ♦ గుసగుస మనుచు చేమార్పుల మేము మ ♦ ర్మములఁ దడవు
కొనుచుండ నంతలో ♦ తన భర్త వచ్చిన నుపచారములు చేసి ♦ యోగిర' మిడి
కరగత కలశియై ♦ పెరటిలోనికిఁ బోయివచ్చెద నని చెప్పి ♦ వచ్చి నన్నుఁ
గీ. గలిసి గోబంధమునఁ గ్రీడ ♦ సలిపి «మఱల ననుగలియు టెప్పు"డనుచు మే ♦ హనము చేతఁ
బట్టి కదలించి సెలవిచ్చి ♦ నట్టి నెనరు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 50

సీ. తలిరు ప్రాయము నాఁడు ♦ వలపు నాపైఁ జేర్చి మరిగి యడ్డంబుగా ♦ దిరుగులాడు
నుదిగంపు పనులు సే ♦ యుటకు దగ్గర జేరి మేనిసోఁకులఁ గొంత ♦ మెలపుఁ జూపు
ప్రియు లన్నమాటలు ♦ వినుమని చెవి యొద్దఁ జేరి తా గుసగుసఁ ♦ జెప్పసాగు
నది విని "కలికిరో! ♦ యిదియేమి!" యన నవ్వి తలవంచి తనకోర్కెఁ ♦ దెలుప వెఱచు
గీ. దయగలిగికూడ 'తిన్నతి ♦ న్నఁగ' యటంచు బాలసుఖియించి 'యింక నె ♦ ప్పటికి నన్ను
విడువ వలదం'చుఁ బలికిన ♦ నుడుల సొంపు మదిదలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె 51

సీ. ఇంతి కన్నెఱికంబు ♦ నెఱుఁగని చిన్న నాఁ డచ్చిక మచ్చిక ♦ లాడి కూడి
మన సొక్కటిగ జేసి ♦ కొనిన పిమ్మట సిగ్గువిడచి సందేహంబు ♦ లడుగఁ దొడఁగి
'నీ చెయి దాఁకిన ♦ నా చోటఁ జెమరించు మొలకచన్నుల మొనల్ ♦ జిలజిల మను
మనసైన యంగుళి ♦ మరునింటఁ జొనిపిన నీదు ప్రధానంబు ♦ నించినట్లు
గీ. గలుఁగదు సుఖంబు స్వప్న జా ♦ గరములందు కన్నులకుఁ గప్పినట్లుందు ♦ విన్నిఁటికిని
మూల మెఱిగింపు' మన్నయ ♦ మ్మృగుద మాట మదిఁదలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. సరసత నొక దాని ♦ సంకేతదినమున నన్యకాంతను గూడి ♦ యపుడె వచ్చి
దానితో గూడ నా ♦ తమక మించుకయున్న ననుమానపడి పైకి ♦ యడరి చూచి
స్మరకేతు బిలము వి ♦ శాలమై ద్రవముండి కఱకుమీఱియు మొన ♦ గడుసుబారి
యున్న నిదానించి ♦ యుపరతికి గడంగి నిలుపక సేయుచు ♦ నెలఁత నాదు

గీ. కళ నిలువ కొంతవడి కళి ♦ కష్టముగను కలక బాఱంగఁ జేయ నా♦కళయు జాఱి
నాదు ద్రవ సుఖ న్యూనతల్ ♦ నాకుఁ జూపి చెంపఁ గొట్టిన నే మ్రొక్కి ♦ చింతదీర్చి
నది దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 53

సీ. 'సామాన్య యెంత నీ♦జంబు బల్కిన మఱియొక్కనితోఁ గూడ♦కుండ దానిన
'యే నట్టి దానిఁ గా ♦ నిది చూడు' మంచు పందెము వేసి యట కొన్ని ♦ దినములకును
యే నూర లేకుండు ♦ టెఱిఁగి యాన్యునిఁ గూడ మఱుదినంబున వచ్చి ♦ మరుని కేళి
గావించుకో లోన ♦ కఱరు లేకుండుట కౌఁస్పల బిగియెల్లఁ ♦ దప్పియుంట
యంగజ గృహ మధ్య ♦ లింగమార్గము విస్తరించి యుండుట విలో♦కించి "దొంగ
చిక్కితివో" యన్న ♦ చిఱునగ వొలయ 'లే'దంచుఁ దా గొంత సా♦ధించి పిదప
గీ. గురుతులను జూపఁ దప్పించు♦కొనఁగలేక నియ్యకొని 'యిట్టి జాణ లెం♦దేని కలరె!'
యనుచు జంకుచు నాతోడ ♦ నన్నమాట మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. ఒక యెలనాఁగ నే ♦ నొప్పుగా క్రీడించి స్ఖలనంబులు చేసి ♦ సరసనుండ
బాలకుం డేడ్చిన ♦ పాలిచ్చుటకుఁ బోవ చెలఁగి వెంటనె దాని ♦ చెలిని నేను
కలసిన నది యది ♦ తెలిసి 'నాతో పునఃకరణంబునకుఁ గొంత ♦ కాలయాప
నము చేసి కూడుదు ♦ వనుచుఁగ ఒట్టి నీకింత లోపల శక్తి ♦ యెట్లు గలిగె
కరము చిత్రం'బని ♦ పురుష స్వభావంబు నెఱుఁగక కోపించి ♦ "యిప్రుడు మఱల
నను గూడుమ"న నట్లు ♦ నా కేమియును లేక నలుకఁ దీర్చుట కుపా♦యంబు వెదకి
గీ. వేగ పడవిల్లు డోలమం♦దించి క్రేవ చేర గదిలించి యేమేమొ ♦ చేసిచేసి
నాతి కళఁ జారఁ జేసిన ♦ నాఁటి యొప్పు మదిఁ దలంప బ్రహ్మానంద♦మదియ కాదె. 55

సీ. ఇగరు యిస్తాంబుల్ స♦హీ గులాబీ జేర్చి అర్గజా నా మేన ♦ నలఁదరాగ
నాతి నే కడవాఁడ♦నా యన్న 'రక్సీరు మాఫుకరో' యని ♦ మమత తోడ
వెస నంబరంబులు ♦ విచ్చి తా చంపినపంక మలంది నా♦పైన వ్రాలి
కౌఁగిలించి పెనంగి ♦ కఱయు నా మేన గంధము బూసి సురత ము♦ద్ధతి సలుపుచుఁ
దగ్గుచు లో మొగ్గ♦తాఁకుల కడు బిగువుల తమిఁ జూప నే ♦ బలుకకున్న
వగలాడి యెక్కెక్కి ♦ వగయేడ్పు లేడ్చుచు పట్టువిడ్పుల లోన ♦ పరఁగఁ జేయ
గీ. పంతమున లోన చక్కలి♦గింత లిడుచు కాంత కా రెండు తెఱఁగులు ♦ గలుగఁ జేయ
నెలమి కళలట్లు విడిచిన ♦ నెఱతనంబు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. కాంత వేడుక నన్ను ♦ గనుఁగొని నీయట్టి తనయుండు గావలె ♦ నని యడిగిన
కడఁగి లోపలి కళి♦కారంధ్ర వైపుల్య మది లేక చెమ్మ గొ♦డారిలి నీచు
వాసన మిగుల రా ♦ బరికించి నీకు బిడ్డలు గల్గరనిన న♦వ్వేలఁది రోస
మున బుతుదినములఁ ♦ బుతుషూలఁ దప్పక గలయుచు నటు కొంత♦కాలమునకు
మది నాస మాని గ్రమ్మర నన్ను బ్రార్థింప యెముక కర్ణికలోన ♦ నునిచి యపుడు
గీ. శ్రమము నొందించి నాళ రం♦ధ్రము నడల్చి పరఁగ మందిచ్చి కూడ గ♦ర్భంబు వచ్చి
శిశువుఁ గవి నన్ను మెచ్చిన ♦ చెలియ ప్రేమ మదిఁ దలంప బ్రహ్మానంద♦మదియ కాదె.

సీ. కాముకి నను జేరి ♦ కలయు మటన్న నే నెలమి బాహ్యరతంబు ♦ సలిపి తెలిసి
గాఢరతమ్ముకు ♦ కాలంబు గా దన్న నదియేమి కారణం♦బనుచు నడుగ
పొసఁగ లోకమలంబు ♦ ముకుళించి యుంకుట యొప్పైన మరుకోల♦ యుబికియుంట
ప్రక్కలు మందమై ♦ ద్రవములో చద్దివాసన గల్గియుంట కు♦చములు కఠిన
తను వహించుటయు గర్భమనల నాభరంధ్రమ్ము నిరంగునిగాఉుట సలి♦లంబు నోర
నూరుట చప్పని ♦ సౌరభం బారయుట మొదలైన గురుతు లిం♦పొదవఁ జూపి
గీ. యింతి నీ కింక ముట్టు రా ♦ దిది మొదలుగ నల్పరతమునఁ దని వొందు♦మనుచు నట్లు
చేయనను మెచ్చుకొన్నయా♦ చెలువపూయలు మదిఁ దలంప బ్రహ్మానంద♦మదియ కాదె.

సీ. బాఢరతంబున ♦ వైపుల్య మందిన నతను కోశిక చేత ♦ నమరఁ బట్టి
పైకి నాకర్షింప ♦ పక్కలు గదిసిన బిగువొంద నట్లు నీ♦దగు కరమున
తొలఁగి సడలకుండఁ ♦ దోచి పట్టు మటంచు నను విపరీత బం♦ధముల నెనగి
గ్రామ్యబంధంబునఁ ♦ గలయు మీ వని పల్కి వాలాయ మఱకాళ్లు ♦ నేలనూది
జఘనంబు వంచి జొ♦ల్పిన కేల బిగియించి పీ పెత్తి పట్టి బల్ ♦ వేడ్కమీఱ
గీ. గలయుము మన నేను జొన్పమి♦క్కిలి బిగువుగ యుంటగని మెచ్చుకొన్నయ♦య్యువతి 'యిట్టి
యరిది నేత లెఱుంగు దే!' ♦ యన్నమాట మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. ఒక ప్రౌఢకామిని ♦ యొక్కనాఁ డొక ముగ్ధ కేమేమొ రుచి దెల్పి ♦ యింపు మీఱఁ
గొని తెచ్చి నా ప్రక్క ♦ నునిచి హస్తము బట్టుకొని యది చూడంగ ♦ కోర్కె మీఱ
మొదల తా నన్నుఁ గూడి ♦ 'యిది యెంత హాయి గా నున్నదే!' యని తాళి ♦ యొదవ జేసి
యంత దా లేచి య♦య్యబల వల్దవ నీవి సడలించి బలిమిచే ♦ శయ్యఁ జేర్చి
కదలనుండఁగ బట్టి ♦ గవియుమటన్న నేనటుఁ గూడ "కొప్పి నొ♦ప్ప" నిన నింక

క్షణ మోర్చుకొమ్మని ♦ సఖి యూఱడించి యుంచుక సేపునకు బాల ♦ సురత సౌఖ్య
పారవశ్యము జూచి ♦ 'పడఁతి నాతోడె యిప్పు డెటున్న' దనిన నా ♦ 'పొలతి నవ్వ
'కన్నెతీకం బాయెఁగద!' యని పల్కి దానంతట నన్ను ముద్దాడి "సామి!
గీ. యిటుల మనసొప్పి నీ దయాభివృద్ధి కొఱకు నేను జేసితి నీపను ♦ లింక నెపుడు
మఱువ వలద''ని చెప్పిన ♦ మగువమాట మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 60

సీ. యువతి కైసేసి నా ♦ యొద్దకు రా జూచి మొనసి కన్నులు వేగ ♦ మూసికొంటి
నాతి డగ్గరఁ జేరి ♦ 'నా నేర మేమ'న్న నలిగి నట్లుగ నేను ♦ బలుకకుంటి
లేమ యోజించి శరీర భేదా భేదములకు విశ్లేష సంభోగ శూన్య
తలకు చింతించు నా ♦ తల పెఱింగి నిరీక్షణాలింగనములకు ♦ సిద్ధమైన
మొలచీర కంచుకంబును విచ్చి నగ్నయై కదియరా విదళించి ♦ కసరుకొంటి
భూషణంబులు దుల్చి ♦ పూఁబోఁడి చేరరా మనసెయ్య కేనట్లు ♦ మఱలుకొంటి
గీ. యొదలి గంధంబు గడిగి రా ♦ నూరకున్న 'సామి!యలుకేల యీ తప్పు ♦ సైపుమ'నుచు
చెలియ నను గూడి హాయి చే ♦ సిన విధంబు మదిఁ దలంప బ్రహ్మానం ♦ దమదియకాదె.

సీ. పసిఁడి పళ్లెరములో ♦ బహువిధ రుచ్య పదార్థంబు లిడుకొని ♦ తరుణి నేను
యెదురుగాఁ గూర్చుండి ♦ ముదముతో భుజియింఁచుతఱి కబళంబు లొంటి ♦ దొరలనోటి
కందిచ్చుచును బుగ్గ ♦ లందందఁ బొడుచుచుఁ బ్రేమమిూఱంగ ఖీ ♦ డా మిఠాయి
యిరుపక్కలను నోళ్ల ♦ నిడుకొని చప్పరింపుచుఁ గరంగిననను ♦ మోవియందు
కొని 'యిది కడు రుచి' ♦ యనుచు నొండొకచేత మర్మముల్ దడవుచు ♦ మమత మీఱఁ
గలయుచు నిదివేళ కా ♦ దని నిలుపుచు నతియత్నమునఁ దమి ♦ నాపికొనుచు
గీ. పాలు పాయసమునుఁ దాను ♦ గ్రోలినోరఁ జెలిమినుంచుచు రుచులనుఁ ♦ జెప్పికొనుచు
నాతితో నారగించిన ♦ నాఁటి సొగసు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 62

సీ. ఒకనాఁడు పలుమారు ♦ నుడుఁగక రతిసల్పి తాపుచే లోపలి ♦ ద్రవమడంగ
మంటచే నుద్ధతి ♦ మఱి తగ్గిపోవ నే నన్యకాంతను చిత్త ♦ మందుఁ దలఁచి
కన్నులుమూసి చిక్కఁగ నూపిరిబిగించి వదలక కడు వడి ♦ వడిగఁ జేయు
తఱి దానిపేరు మైమఱపుచే జాఱిన నదివిని యావృత్తు ♦ లధికమగుట
వలనను చిరకాల ♦ పరిచయంబునఁ బరిశ్రమమునఁ దనమీఁది ♦ మమతలేక
మఱియొక్క కామిని ♦ మనమునఁ దలఁచి యివ్విధువున రతికడు ♦ వడిగఁ జేయు

గీ. చున్నవానిగ మదిలోన ♦ నన్నెఱింగి చెలియ కినిసి ఛటాలునఁ ♦ జెంపఁ గొట్టఁ
బదరి లేవఁబోఁ బోనీక ♦ యదిమిపట్టి నాతితోఁ గూడితనిసెన ♦ నాఁటిసొగను
మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 63

సీ. మగవారి పేరన్న ♦ దిగులొంది పఱుగెత్తు ముగుద నొంటిగఁజూచి ♦ పొంచిపట్ట
విదలించివైచుచు ♦ వెసఁ దన్నుకొనుచు జెగ్గిలుచు నేడ్చుచు బుజ్జ♦గింపులకును
సొంగ్యకాకున్నఁ జె♦ల్చనఁగ్రిందఁ బడవైచి గోడకుతలమోపి ♦ గూడి పదము
లుడుఁగక పైకెత్తి ♦ తొడలచేబిగియించి జానుపార్శ్వముల హ♦స్తములు సాచి
మెలఁతచేతులు పట్టి ♦ మెడకు లంకెసుటించి కదలకుండఁగఁ బట్టఁ ♦ బదరి గోద
గీ. నంబు సేయుచుఁ దిట్టుచుం♦డంగ బలిమిఁ గుక్కుటక్రీడఁ గావించి ♦ గోర్కె తీర్చు
కొనిన రుచిఁగని బాల సొ♦క్కినవిసంబు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 64

సీ. మఱియొక్క పేరియకి ♦ మదనోత్సవముసల్ప శృంగార మొనరించి ♦ రంగుమీఱ
వేడ్కతోఁ గ్రీడించు ♦ విధములన్నియు మదనూహించి యుత్సాహ♦ మొప్ప హంస
కములు మ్రోయఁగఁ బాన్పుఁ ♦ గదియ వచ్చిన లేచి కౌఁగిటఁ జేర్చి యం♦కమున నునిచి
బాహ్యకేళీకళా♦పరిపాక మొనరింప నది తమినిల్ప జే♦ననుచుఁ బైకి
నెక్కఁబో ననుమాన ♦ మించుక కోఁచిన దిగులొంది పాదంబుఁ♦ చేసి గ్రిందఁ
బెట్టి పానుపుడిగ్గి ♦ చస దీపమునఁజూచి యశుభ్రిలనించుచు ♦ నాఁడుదాని
గీ. పుట్టువది యేటికని తన్నుఁ ♦ దిట్టుకొనుచు విరులవండలు సొమ్ములుఁ ♦ బెఱికివైచి
కలశమందుక తొలఁగిన ♦ కలికి వెతలు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 65

సీ. సురతాంతమునఁ దన్వి ♦ సొలసి నా యుర మానుకొని సుఖాసీనయై ♦ యొనర మేని
విఱుపున పైకెక్కి ♦ కరములు పైకెత్తి చను మొనల్ నిక్కంగ ♦ వెనుకకొఱగఁ
దిలకించి యేను న♦వ్వులకుఁ జన్నులపై నఖాంకురంబుల నింప ♦ జంకుసొబఁగు
వెలఁది యేమఱియుండ ♦ వెనుక నేవచ్చి చన్నొడసిపట్టిన నులిక్కి♦పడుచు నెవ్వఁ
డని గిఱుక్కునమల్లి ♦ కనుగొన్న చూపులు, నిదురించియున్నచో ♦ నేనుగూడ
ఝల్లని తన కాలు ♦ జాడించుసొగసును నీరాడుతఱిఁ జొంచి ♦ నేను బోవ
గీ. లేచి చెయ్యడ్డమిడుకొని ♦ లేమ వంగి యంబరము బుచ్చుకొని ♦ యిట్టి యాగడంపుఁ
బనులు వలదంచు నెలఁత ప♦క్కి నరమించి నదియుఁ దలఁప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. బాహ్యకేళినొనర్చి ♦ వదలిన 'నిట్టి పేతల చానలకుఁ దృప్తి ♦ కలుఁగ' దనిన
యంతకు నే నేమి ♦ యనకూరకుండిన "మగవానివలె నింత ♦ మాత్రమునకు
పలుమఱు వన్నెల ♦ బిలిపింపవలె" నన్న నంతట నేఁగూడి ♦ పంతములర
కళ చలింపఁగఁజేసి ♦ ప్రక్కన వెనుకకుఁ దీసినఁ గోపంబు♦ చేసి తిట్టి
నఖములగిల్లి క్రి♦న్నన పదంబులఁ దన్ని బొగిలియేడ్చుచుఁ దల ♦ మోదికొనుచు
'యిదిధర్మమే?' యని ♦ వదలక పైనెక్కి కఱచి చెక్కులు గొట్టి ♦ కలసిమెలసి
గీ. గ్రద్దన మనోజసదనంబు ♦ రుద్దుకొనుచుఁ గ్రిమ్మ చిమ్మన గ్రోవిచేఁ ♦ జిమ్మినట్లు
కళను జిలికించినట్టి ♦ యా కాంతహాయలు మదిఁదలంప బ్రహ్మానంద ♦ మదియుకాదె.

సీ. ఒకలేమ పరిమాణ ♦ మూహించి నీచరతము దీనికింక స♦త్వమునఁ బెద్ద
కాలంబునకుఁగాని ♦ కళజాఱదని క్రీడసలుపుచుఁ దనంత నా♦కళ స్రవింప
నది యీసడించిన ♦ నదిగాంచి వృద్ధిలోపింపకమున్నె యా♦పిరిబిగించి
యతివేగమునఁ గూడి ♦ యాక్షణంబున పునఃకరణంబునకు శక్తిఁ ♦ గలుఁగఁజేసు
కొని సరిఁ [1]జేసుట ♦ కువిదను పైఁ జేర్చి సుఖియింపఁ జేసినఁ జూచి 'యార!
గీ. నా మనసెఱింగి క్రీడించి ♦ సొమ్ముఁదనిపి నట్టివారి నెందునుఁ గాన♦ నైతి నెంత
జాణవని మెచ్చుకొన్న యా ♦ సకియమాట మదిఁదలంప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. నవమాసగతయైన ♦ యువతితో నే గ్రామ్య బంధంబునందు శే♦షంబుఁ జొనిపి
గదియించి చేతుల ♦ గరిత కొంకులుబట్టి యదిమిన మన్మథ♦సదన మప్డు
పైకుబ్బ మోకాళ్లు ♦ వంచి నే లోమొగ్గఁ దాకించి మెండింపఁ ♦ దప్ప కపుడు
రమణికి మిక్కిలి ♦ శ్రమము గల్గిన నిదానించి రోగము గల♦దంచు విడుతు,
గీ. సుఖపరవశత్వమొందినఁ ♦ జూచి దీని కేమి వ్యాధియులేదంచు ♦ నెఱింగి మమత
మిగులనామీదఁ గల్గున♦ట్లుగ నొనర్చి యనుభవింతు, బ్రహ్మానంద ♦ మదియకాదె. 69

సీ. సంఘాటబంధంబు ♦ సలుపంగఁ గోరి యే నరమరలేని సుం♦దరుల నిద్ధ
తిని శయ్యపైఁజేర్చి ♦ యనువుగా నొకదానిఁగూడి వేఱొకదాని ♦ కుచయుగంబుఁ
బట్టిముద్దాడ న♦ప్పుడఁతి తన్నాంతరరతి సేయలేదంచు ♦ రహిదలంచి
మోమువాంచిన చాన ♦ ముదమొప్ప నే గూడి తొలుతటిదాని నం♦గుళిరతంబు

---

పా. 1. జేసుట ♦ కునుదానిపైఁ

నలువ సైఁపక యది ♦ తొలఁగి క్రిమ్మఱ నన్నుఁ జేరుమటంచు చేఁ ♦ గీఁటఁ దాని
సన్నయుఁ గనుఁగొని ♦ నన్నది విడకున్న పరఁగ జ్యేష్ఠ కనిష్ఠ♦ భావములను
వారి యీర్ష్యాప్రీతు ♦ లారసి యేను జోడుగఁ గూర్చి సమబంధ♦మునఁ బెనంగి
మార్పులు సేయుచు ♦ నేర్పున నొక తెకు 1ముందుకళాస్రావ ♦ మొందఁజేసి
గీ. సమ్మదముఁ జూపి పెఱదాని ♦ సైఁగఁ జేసి క్రీడఁగావించి కళ చిలి♦కించి తనుప
ఘనత నిరువురఁ దృప్తులై ♦ నను నుతించు టెదఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. ఇంతియొక్కతె దొడ్డ♦యిల్లాలినని యుండ దానిభావ మెఱుంగఁ ♦ దలఁచి యొక్క
వెరవున నాలేమ ♦ వినుచుండ, నెంబడి తరుణితో లోకవా♦ర్తలుగ నేను
విటవిటీజనులు గా♦వించుచేతలు పచ్చిపచ్చిగఁ దెల్ప కో♦పంబులేక
ఈర్ష్య నొందక నవ్వ ♦ నే నదివీక్షించి యిఁకఁ జిక్కెనని ధైర్య ♦ మెసఁగ నొంటి
నున్నచో నట్టి న♦గ్నోక్తు లే జెప్పిన నవ్వుచు సిగ్గున ♦ నన్నుఁజూడ
గీ. 'తరుణి సిగ్గేల యిఁక?' నంచుఁ ♦ గరముబట్టి యొద్దనిడుకొని యది 'వద్దు ♦ వద్ద'నంగ
లేదు లేదంచు గ్రిడ స♦ల్పిన నెలంత 'యన్యులెఱిఁగిన గర్హింతు♦ ర'న్నమాట
మదిఁ దలంప బ్రిహ్మానంద ♦ మదియ కాదె. 71

సీ. అతివ నేనును నూత్న♦ యౌవనమునుండి సురత వైదగ్ధ్యంబు ♦ లెఱుఁగనితత్రి
నిశ రతిక ప్రేమ ♦ నెంతయు మితిలేక బెరుఁగ నేకాంతంబు ♦ దొరకునపుడు
సంభాషణంబులు ♦ సలిపెదమని పొంచి సమయమైనప్పుడు ♦ సాధ్వికోడ
యమున మాటాడ లే♦కటు దాటిపోయిన విలపించి మఱియొక♦వేళ దొరక
యొడలంటఁగాఁ బోవ ♦ వణకుచే చెయ్యి కాలాడకుండఁగ నుండ ♦ నవల హాతి
కలయఁగూర్చిన నధి♦క ప్రీతి నే రమించుట కేమిలేక యా ♦ సురభిళాంగి
గీ. కొనర చే మెలుపవఁ జేసి ♦ మనసుఁ దీర్చుకొనఁగ లే కిర్వురము నిట్టు♦ కోర్కెలెల్ల
చనఁగ నతికష్టమునఁ గూడు♦కొనిన విధము మదిఁ దలంప బ్రిహ్మానంద ♦ మదియ కాదె.

సీ. ఒకనాఁడు నేను తోఁ♦టకుఁ బోవ నదిమంచివేళ యం చొకతన్వి ♦ విభునితోడ
నమ్మగారింటికి ♦ నటుఁ బోయివచ్చెద నని భర్తతోఁ జెప్ప ♦ నాతఁ డొకని
తోడిచ్చి బంపిన ♦ తోఁటయొద్దకువచ్చి మఱచివచ్చితి నేను ♦ వెరవుసామ్మ
డెమ్మ నే నందాక ♦ నమ్మయింటికిఁ బోవ నని బొంకి పంపి తా♦నవల నన్ను

పా. 1. ముందుకళాభావ

గనుపించుకొని ప్రీతిఁ ♦ గనుసన్నఁ జేయ నే దెలిసి యా చెలిఁగూడి ♦ దృష్టిఁ జేసి
'యలివేణి యింతసా ♦ హసము జేతురె' యన్న నవ్వి 'యిన్నాళ్లకు ♦ నన్ను నిన్ను
గీ. గలుపయిటఁగూర్చె నింకొక ♦ నాఁడు వత్తు' ననుచు నొప్పించుకొని తోడు ♦ మనిషి కెదుర
గలుసుకొని పోయినట్టి యా ♦ కలికిపనులు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. వేసవులందు నే ♦ వేఁటఁ బోవఁ దలంప వేడుకజూడ మీ ♦ వెంటవత్తు
ననిన నీవేల రే ♦ యడవిలో శార్దూల భల్లూక సూకర ♦ భయము, తేళ్ల
చిలువల బాధలు ♦ గలవన్న నీయొద్దనున్న నా కొకభయ ♦ మెదవదనుచు
రోదనమొనరింప ♦ నే దోడుకొని పోయి నీటిచెంగట నొక్క ♦ మాటులోన
నాసీనఁ గావించి ♦ యచ్చోటమృగముల వంచించి వధియింపఁ ♦ బొంచియుండి
మెకములు రాగ నే ♦ నొకతుపాకిని పడద్రోయఁ గన్గొని నాదు ♦ వెన్నుచఱచి
గీ. భళిర! యని మెచ్చుకొనుచు వా ♦ ర్తలు సలుపుచు నతను సంక్రీడఁ జేయుచు ♦ నట్టె నిశలు
క్షణములుగ బుచ్చినట్టి యా ♦ గరితచేఁత లెదఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 74

సీ. నెఱిసాముఁ జేసి ము ♦ ప్పూరిఁగొన్న కనకంపుప్రతిమరా యని చెప్ప ♦ వచ్చు మేను
బటువైన టెంకాయ ♦ పగులఁ గొట్టుటకు సంశయములేదని చెప్పఁ ♦ జాలు చనులు
కఠినతయును మణి ♦ కళిక నెత్తైదు మంపు బంగారు పటకారు ♦ పగిది నొప్పు
విగతలోమ భగంబు ♦ బిగువునుఁగల యొకశ్యామయు నేనును ♦ సమ్మదమున
నగ్నులమై మడ ♦ నక్రీడఁ గావించుతఱి నది నాసైకి ♦ దాఁటి కూడి
గుండియ లదరనొ ♦ క్కుచు మేను చెమరింప తేలగన్నుల వైచి ♦ సోలివ్రాలి
కళను నేవిడువంగ ♦ గని నే శబా సనిబలుకుచు చుబుకంబు ♦ బట్టి యొడలు
గలయంగ నిమురుచుఁ ♦ గాంతరో నిన్ను నమ్మితి నింక నామీద ♦ సతతమిట్టి
గీ. స్నేహముంచుమటంచు నేఁ ♦ జెప్పుకొనిన మాటలాడంగలేక నా ♦ మమతఁ జూచి
నాతి తలయూఁచి చెప్పన ♦ నాఁటి హొయలు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. విజిటింగుహాలులో ♦ వెలలేని నిల్వు దర్పణముల నన్నియుఁ ♦ బ్రతిఫలింప
సరిగులోబులు వాలు ♦ సైజ్లు లస్టర్ల లోపలిదీపములు పట్ట ♦ పగలు జేయ
నగరుబత్తీలు మే ♦ లైన యత్తరు మల్లెపూల వాసనలు పం ♦ ఖాల గాలి
చే నిండి మెచ్చఁ ♦ జేయంగ పండితుల్ చెలికాండ్లు బంధువుల్ ♦ చేరికొలువ
బంగరు పెత్తముల్ ♦ రంగుఁగాఁగొని చోప్దార్లు ముంగర బరా ♦ బర్లు చేయ

మోర్చేలు. చామరం♦బులు వీచుచు పిఱుందఁ బ్రక్కల సేవకుల్ ♦ బలసి కొలువ
దండిసోఫాలపై ♦ దర్బారుసేయ మేళ్ళు జమాయించి యా ♦ లలన కొంత
సేపు లాస్యకళా వి♦శేషంబులను జూపి యందున్నవారి కా♦నంద మొసఁగి
గీ. యిది సమయమంచుఁ దనభావ ♦ మెఱుకపఱచికనులలో ద్రొక్కు నే బర♦ఖాస్తుజేసి
యచ్చటనెకూడి క్రీడింప ♦ హాయినందె కువలయేక్షణ నను మెచ్చు♦కొన్న విధము
మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 76

సీ. ఒకనాఁడు హితజన♦యుతముగా ముఖ్తసర్ఖాసు దర్బారు నే ♦ జేసివేడ్క
నరుదుగా నే జెప్పి♦నట్టి హిందుస్తాని ఖ్యాలు రఫ్తాలు బల్ ♦ మేలుగాఁగ
నా పైఁడిబొమ్మచే ♦ నయముగఁ బాడింప నయ్యర్థ మత్తన్వి ♦ కతనుతాప
మొనరింప యభినవఖ♦త్తెడు టప్పా పాడి కనులచే భావ ము♦త్కలికఁ దెలుప
నందఱినిండ్లకు ♦ ననిచి యే నింత యుమ్మరమేల ననఁగ సైఁ♦బడి లతాంగి
గీ. తెఱవలమనంబు మీ కేమి ♦ దెలుసుననుచు నా కులో చెమ్మఁ జూపి తా ♦ నన్నుఁ గూడి
కోర్కెదీఱఁగ తమిఁ దీర్చు♦కొన్న సొబగు మదిఁ దలంప బ్రహ్మానంద♦మదియకాదె.

సీ. ఒకనాఁడు నేను త♦ప్పక తమ్మలముసేయు తఱివచ్చి తాఁ గొంత♦తమ్మలంబు
సేయుచు మడుపు నా♦చేతి కందియ్య వలదన్న తనచేతఁ ♦ బట్టినోటి
కందియ్య నంతె చా♦లన తనపెదవిచే నా నోటనునిచిన ♦ నేనుపట్టు
కొన నదివిడువ నే♦నును వెంటవిడిచిన నెఱిఁగి తా పంటనం♦దిచ్చి సగము
కొఱికికొనంగ నే♦గొని చర్వణముజేసి యిది రుచిలేదని ♦ యీసడించి
పుక్కిటనున్న తాం♦బూలంబుతోఁగూడ నుమిసిన నేమిసే♦యుదు నటంచు
గీ. రమణి చింతించి యంతఁ దా♦నమలి విడెము దినుమనుచుఁ బెట్టనెంతక♦మ్మనయఁటన్న
నన్నుముద్దాడి గలసిన♦ నాఁటిసొంపు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 78

సీ. ఒకలేమ తనభావ ♦ మొగిఁదెల్పుటకు వేఱె యొకదానిబిడ్డ నె♦త్తుకుని వేగఁ
దా ముద్దులాడి నా♦సామి నాపండు నాబంగార మనుచు న♦బ్బాలునోట
విడియంబుఁ బెట్టి పె♦న్దొడపూఁద నిడుకొని చెక్కిలినివురుచుఁ ♦ జెంపఁ గొట్టఁ
బో బాలుఁడేడ్చిన ♦ బుజ్జగింపుమ నింక నేడ్వకు నీకుఁ జ♦న్నిత్తు ననుచుఁ
బయ్యెదఁదొలఁగించి ♦ పాలు లేవనిబల్కి చిఱునవ్వు మోమునఁ ♦ జెలఁగ నింత

గీ. కఠినుఁ డగుబిడ్డఁ డెందునుఁ ♦ గలఁడె యనుచు నన్నుఁగని తాఁకనాడుచుఁ ♦ గన్నుసైఁగఁ
జేసి కఱఁగించి చేసిన ♦ చెలియరతులు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 79

సీ. బిడ్డనొప్పులు గను ♦ పించిన నీసారి గడతేరుదునో లేదొ ♦ కలయుమనును
ప్రసవింపఁ బురిటిలో ♦ పల చూడఁబోయినఁ జేమార్పులకు నేల ♦ చెల్లదనును
జ్వరమువచ్చిన మందొ ♦ సంగ బోయిన నిది మదనజ్వరము నన్నుఁ ♦ గదియుమనును
పరితరాత్రులనుచు నూ ♦ రకయున్నఁ జూచి నన్నలచిన ప్రతిఫల ♦ మబ్బదనును
కాలంబుగాదని ♦ కసరిన వలవల చలమొప్ప నేడ్చుచుఁ ♦ జత్తుననును
గీ. యుల్లముగ నంగితత్కాల ♦ యోగ్యములగుపనులు నేఁజేయ నా సామి ♦ యనుచు మ్రొక్కి
ముద్దుఁగొని నన్నులంచిన ♦ ముదితమమత మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. అలిగి కొన్నాళ్లు నే ♦ నటుఁబోవకుండిన తనగర్భమున నొప్పి ♦ దగిలె నింక
నోర్వలే నొడలిలో ♦ నుండవు ప్రాణంబులనుచు ఓట్లలుచుచు ♦ నట్టె దన్ను
గొనుచు నేడ్చుచునుండ ♦ గుంపులుగూడి నాకడ కొక్కచెలి నంప ♦ దడయక దియు
నట్లు చెప్పిన భయ ♦ మంది నే జన కడుపొత్తుము నీవన ♦ నొత్తనచటఁ
గాదని యట క్రిందు ♦ గాఁజూప నచ్చోటఁ బిసుకంగ నొప్పిచే ♦ బిగియఁబట్టి
గీ. నటులఁ గౌఁగిటఁ జేర్చి యా ♦ స్యమున నాస్యముంచి యప్పని కొప్పిన ♦ నొప్పిపోవు
ననుచు ననుఁగూడి క్రీడించి ♦ నట్టి మమత మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియ కాదె.

సీ. చిన్నారి యొకనాఁడు ♦ చెలులతో సరసంబులాడుచు నాయొద్ద ♦ కరుగుదెంచి
యాసీనయై యుండ ♦ నపుడు నే నొకచెతిఁ గనుఁగొని నవ్విన ♦ గినుక గదుర
పాలఁతి దిగ్గున లేచి ♦ పోవంగ జెయిబట్టి బలిమిఁ బానుపుమీఁదఁ ♦ బడఁగ వైచి
1పికిలిపిట్టలరీతి ♦ వెస లాగమేసి నే బిగియించి, నవ్వుచు ♦ వెలఁది! కోప
మెంచరింపఁ జెల్లునే ♦ యని యురోజము ముట్టుకొని బాసఁ జేసిన ♦ కోపమణఁగి
గీ. సొకరికొకరు పెనంగి యొం ♦ డొరుల పైకి మొనసి నిగ్గుచు కాటందు ♦ కొనుచు తొలఁగ
ద్రోయుచు నలసి కలసిన ♦ సోయగంబు మదిఁ దలఁప బ్రహ్మానంద ♦ మదియ కాదె. 82

పా. 1. పికిలిపిట్టల రీతి ♦ వెసలాగ లేచి

సీ. ఒక యెలనాగ యిం♦టికి దూరమైయుండి యుబుసుబుచ్చుటకుఁ దా♦ నొక్కనాఁడు
వచ్చి, దవ్వుల నుండి♦ ముచ్చటలాడెద ననిన నే బిలిపింప♦ నణఁగియణఁగి
వచ్చి, కౌఁగణచి య♦వ్వలనిల్చి సరసంబులాడుచు ముట్టంటు♦ యంబరమున
కే కదా యదివీసి♦ క్రీడింపఁగారాదె యనిన నే నది బ్రహ్మ♦హత్యయనిన
సలిలఫేనమునకు♦ చవిటికి చెట్టు బంకకు 1 మాకు పాపమొ♦క్కటియె గాదె
వాటి నంటకయుండ♦వశమె యేరికైన నవనిలో స్త్రీహత్య♦కన్న బ్రహ్మ
హత్యాంశ మది యెక్కుఁ♦డగునె యాత్మకు మతి పరికింప పాపమొ♦ప్పగిది గలుగు?
ననుచు సైఁబడిరాగ♦ నదిచూచి పరువెత్తు శుకవాణి తెరిమి ప♦ట్టుకొని కూడి
గీ. తనమనసు దీర్చుకొన్నగా♦ వెనుక నేను తానమొనరించి చలువవ♦స్త్రములుదాల్ప
చూచి పకపక నవ్విన♦ సోయగంబు మదిఁ దలంప బ్రహ్మానంద♦ మదియకాదె. 83

సీ. పరసతి యొకనాఁడు♦ వచ్చినాకడ నుండ ననుమానపడి యింటి♦వారు దారి
కాచియున్నారని♦ కడువేగ నొకచేటి చెప్పిన నిఁకనెట్లు♦ సేయుదనిన
నన్నేమిచేయుదు♦ రెన్నాళ్లనుండియో సారసు మదినిటు♦ కోరియుంటి
ననఁగ నే నిటులేల♦ ననిన నీపైయాస మిక్కుటంబుగ మది♦ నెక్కొనంగ
సమయంబు గోరకమి♦ చనుదెంచుటకులేక మగఁడు నన్నెప్పుడు♦ దెగడి విడుచు
నో యని మ్రొక్కుచు♦నుంటి దేవుని కృపమానక విడిపించె♦ నేని రొట్టె
గీ. విఱిగి వెస నేతిలోఁబడ్డ♦ విధముకాదె యెపుడు నీవద్దనేయుండి♦ యిచ్చకొలఁది
క్రీడఁ గావింతు ననుచుఁబ♦ల్కిన ఘసందు మదిఁదలంప బ్రహ్మానంద♦మదియకాదె.84

సీ. పరఁగ నే మెఱుఁగక♦ భయభక్తి నుంచిన మగనాలి వంచింపఁ♦ దగినదూతి
ననిచిన పనికొప్పు♦కొని దానిఁ గైసేసి వీక్షించి వగలచే♦ నెక్కియెచ్చి
క్రొవ్విరుల్ సవరించి♦ కుసుమభేదముల వాసన నీకు తెలుసునా♦ యనుచు నడిగి
యోగిరంబిడి, యన్న♦ మొక పదార్థమున నే దినవచ్చునా చెప్పు♦మనుచు నడిగి
చెలి పండ్లుదిని యుమి♦సిన దానిలో చవియుండునా యని భావ♦మొనరఁ దెలిపి
పవనంబు మెసవి దు♦ర్బలులైన ఋషులన్న వట్టిగాథల కేల♦వగపు? ధాత్రి
నఖిలవేదాంతంబు♦లం దాత్మకసులేపమరయ లేదనుమాట♦ తరుణి వినవె

పా. 1. మాకుసామ్య

ఆనందమే బ్రహ్మ ♦ మని చెప్పు వాక్య మెన్నఁగ జార సంగమా♦నందమే సె
ఫులుఁగుసు చీమకుఁ ♦ దెలియకుండఁగఁజేతు నెఱిఁగిన హరియొద్ద ♦ నెప్పుడుండు

గీ. వనుము రుచి దెల్పి దాని మ♦దంతికమున కెలమిఁ గొని తేఁటుఁ బదియారు♦కళల జెక్కు-
బంధముల సౌఖ్య మొసఁగిన ♦ భళిర యనుచునన్నుదూతిక నటుమెచ్చు ♦ కొన్న విధము
మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె. 85

సీ. వెలఁగూలు ఁడనకూఁకు ♦ చెలిమి కన్నెఁ జీకఁబువకుఁ దోడితేర నే ♦ నొకటుగూడ
నటు గుండెలపర క♦వ్యాజసాధ్వస లజ్జలును నాగరంబున♦ మొనసి తొడలు
వెన్క-కు వంగుట ♦ బిగితాఁకులకు కౌనుతాళియుండుటయుఁ గం♦ద్పపదన
మొగి కన్నెబిగువు లే♦కుండిన శ్రీమయని యేత్చుచు మ్రొక్క-చు ♦ నింకవిడువు
మని తన భావగో♦పనము సేయఁగ నేను కళను జాఱగజేసి ♦ వలువచేత

గీ. వీఁక చెమ్మద్ది యెఱుపేమి ♦ లేకయున్నయిన్నియును దెల్పి నాతోడ ♦ నెంద స్తైరి
చెప్పుమన తెల్లబోయిజా♦చిన నెలంత నెదఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. గాఢ్యబంధమున నే♦గలయ నా కౌనుఱుతరుణిపాదములు క♦త్తైర ఘటించి
కడఁగి చేతులు నాదు♦ మెడకు లంకెలువేయ దానివీపున హస్త♦తలముల ల్లి
బిల్లిగ బట్టి నే♦ నసనెత్తి తిరుగుచుఁ గోర్కె-తో నడుగడు♦గునకుఁ దాఁకు
లమరఁజేయుచు పెన♦వంగుచుఁ గుచములువదలక ఱొమ్మున ♦ కదిమికొనుచు

గీ. రమణితో నాఁటిరాతిరి ♦ రతి యొనర్చిబడల నా మేనిచెమ్మటఁ♦దుడిచి చాల
యలసితివిగద యని నాతి♦ యన్నమాట మదిఁ దలంప బ్రహ్మానంద♦మదియగాదె. 87

సీ. మఱియొకనాఁడు సా♦మాన్య పందెమువైచి విపరీతరతమున ♦ వినుతిఁగాంచి
చెలియ, నీకేమి కా♦వలెనన్న, నామాట చెల్లింతునని బాసఁ ♦ జేసితేని
యడిగెద ననిన నే ♦ నట్లుచేసెదనని బలికిన, నింక మా♦వారియింట
నుండనొల్ల నటన్న ♦ నోహో, యదేమన జనని విత్తాశకు ♦ జారునొద్ద
కఱుగు మీవనితిట్టు ♦ నదిగాక నాయెాడుజోడు వా రందఱు ♦ వీఁడుకచ్చె
వాఁడువచ్చె నటంచు ♦ వట్టిమాటలు బల్కు-దురు దాన నీమదిఁ ♦ గరుణదప్పఁ

గీ. గావున భవద్గృహంబున ♦ నే వసింతు ననుచుఁ బ్రార్థించి మ్రొక్కి-న ♦ నట్లొనర్చి
యనిశమును దానితోఁ గూడి♦వట్టి సొంపు మదిఁ దలంప బ్రహ్మానంద మదియకాదె. 88

సీ. ఒకదాని బల్మి నా♦రికిఁ బిల్చుకొని చన్నమాట విన్నను మేను ♦ మఱచియుంటి
దానిఁగూడినచోట్ల♦ దానిల్లు సఖులను బరికింప గుండె గు♦భాలుమనుసు
విరులు పన్నీరు లం♦త్తరు పండ్లు వంటకంబులు బంపినది మదిఁ ♦ దలఁచి వగతు
నాయట్టి ధీరున♦కే యింత విరహవేదన యుండ నచట నా♦తరుణి కెంత
పరితాపముండునో ♦ పడఁతి ప్రాణంబులువాయునోయని నేను ♦ బ్రతికియుంటి
గీ. నంత నా కొఱకది మేనఁ ♦ బ్రాణములను నిలుపుకొని రాగ నిద్దఱ ♦ మెలమిఁగూడి
యొడలుమఱచి క్రీడింపుదు ♦ నున్నసొంపు మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. ఒకయెలనాగ యిం♦చుక నేరమున నన్ను విడిచిపోయిన నేను ♦ వేఱుదానిఁ
గూడ నాదినమునఁ ♦ గోర్కెతో మఱి కొందరస్మదీయప్రియ ♦ లరిగియునిదియు
నొక్కచోనుండ నే ♦ నుత్సాహమున స్వారిగాఁ జూచి యలిగిన♦రమణి కూడి
నట్టియెలంతతో ♦ గట్టిగా నాతప్పుఁ జెప్పుకొనంగఁ బో ♦ గుప్పుమనుచు
నత్తరువాసన ♦ లత్తఱిఁ బొలయఁ దాఁదెలసి కంపని మోముఁ♦ద్రిప్పిపోసి
కొనుచు నీవసనమం♦డనము లెక్కడివన్న హారి యిచ్చెనను గుండె♦లావటిల్ల
పలుకకుండిన దానిఁ ♦ బరికించితక్కినసతులు నీకేమిచ్చె♦శౌరియనఁగఁ
దనతప్పుఁదలపోసి ♦ కనులనశ్రులునించి యచట నుండక యింటి♦కరుగుదెంచి
గీ. యకట, నాబ్రతుకేల నిం♦కనుచు నొక్కచెలియతోఁ జెప్పిపంప నే♦బిలువనంప
నన్నుగూడి సుఖించిన ♦ నాఁటిసుఖము మదిఁ దలంప బ్రహ్మానంద ♦ మదియకాదె.

సీ. వనజాక్షి మొగ్గవా♦లినఁ గూడ మదనుండు చక్రపటంబుఁ దూ♦పెక్కునట్టి
లాగినక్రియఁ దోచు ♦ లలన నిల్చెనంగ నవలతాపరివేష్ట♦నంబుఁ జూపు
దా నెక్కి తిరుగ నెం♦తయుఁ బిండివిసరెడు ఘనసురట్టముభంగిఁ ♦ గానుపించు
పడఁపడి నే దాని♦పై కెక్కి తిరుగుచో నెస గానుగాడిన ♦ విధముదోచుఁ
బడఁతి తా మోకాళ్లు♦ముడిచి ముందుకుతగ్గి యట్లు పైకుబ్బిచె♦య్యాని వదన
మెత్తిన నే నెన ♦ నింపారఁ గూడుచు ముందుకు జెయ్యూది ♦ యందమలర
యెడచేత దాని యో♦ష్ఠమెత్తిపట్టి పరస్పరాధరంబులు గ్రోలి ♦ నందుకొనఁగ
మదగంధిహస్తి చే♦ మావటుపం డందుకొన్నచందము తోఁచు ♦ నన్నెలంత
గీ. యుత్తరంగునఁ బాన్పుపై ♦ నత్తమిల్లి చతురతచెలంగ బంధసం♦గతులు దెలసి
నన్నుఁగూడి క్రీడించిన ♦ నాఁటిహాయలు మదిఁ దలంప బ్రహ్మానంద♦ మదియకాదె.

చ. ఒకనికవిత్వము న్వినుచు ♦ నూరక యుండను, నాకవిత్వ మం
దొక రొకతప్పు దిద్దు నెడ ♦ నూకొని చూడను, రంపకత్తితో
సిక మొద లంటఁ గోసెదను, ♦ చెప్పనఁ గొట్టెద, మోము దన్నెదన్,
పకపక నవ్వి వ్రాసెద, న♦పండితునోటను మొడ్డ వెట్టెదన్. 8

వ. సకలాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబోవు శేషప్ప విజయంబునకుఁ గథావిధానం బెట్టిదనిన. 9

తే. గీ. అనుఁగుఁదమ్మునితో రాముఁ ♦ డడవి యందు
నున్న, వాల్మీకి చనుదెంచి, ♦ యో నృపాల
చంద్రిమా!యన రాముఁడు ♦ సరగ వాని
నమితవిధులను బూజించి ♦ యనియె నిట్లు. 10

కం. మునివర! నా శోకసంగతి
వినుపింపగవలెను సురులు ♦ వేడుకతో దే
నిని గొనివచ్చిరి భూమికి
ననయము భూసురు లటంచు ♦ ననుచుందురికదా. 11

కం. అన విని నవ్వుచు రాముని
గనుఁగొని వచియించె నిటుల, ♦ కౌసల్యాసుతా!
వినవయ్యా తగినసంగతి
విని యుంటివి నేను తొల్లి ♦ వివిధంబులుగాన్. 12

కం. పెనమునగల నూనెను వేఁ
గినబూరెవిధాన వార్ధి♦కిన్ మధ్యముగాఁ
గనుపట్టు లంక యయ్యాది
ఘనద్వీపం బందు రాది♦కవిభాంచోతుల్. 13

ఆ. వె. వాళ్లతల్లిదెంగ ♦ వర్ణించి యున్నారు
యింక నింత మైన ♦ శంక లేక
మగుడ దాని నేల♦మహిమతి వర్ణింప
చదువువారి కక్క♦జంబు గొలుప? 14

ఆ. వె. ఐనఁగొంతవఱకు ♦ నైనను వర్ణింప
కుందు నేని కవులు ♦ మందుఁ డంచుఁ
దిట్టఁగలరు, గాన ♦ నట్టి యా లంకను
బొగడ ధాత యైనఁ ♦ దగఁడు తగఁడు. 15

తే. గీ. శుక్రుఁడును మున్ను గల్గు న♦సురులు విశ్వ
కర్మదరి కేగి వానియా, ♦ కెలను చిక్కఁ
దీయఁగా నెట్టకేలకు ♦ దివ్య మైన
పట్టణము గట్టి లంక నాఁ ♦ బెట్టెఁబేరు. 16

తే. గీ. మట్టుగలకాంతలను వసి♦పట్టె నేని
ముప్పతిప్పలఁ బెట్టుచు ♦ తొప్పె దూర్చి
రక్త మొల్కుచు నుండగా ♦ రతికిఁ దార్చి
దంపి విడిచెడి ఘోటక♦తతులు గలవు. 17

తే. గీ. అచటియేన్గులు విషయించు ♦ నపుడు కాళ్ల
క్రింద నున్నట్టి కొండలు ♦ కెడలి నలిగి
పిండిగా రాలి వారిధి ♦ నుండ దాని
నిసుక యంచును బల్కుదు ♦ రెల్లవారు. 18

తే. గీ. పట్టణము స్వర్ణమయ మౌచు ♦ భాసిలంగ
మేడలనుగూడ వర్ణించ ♦ నేడ, మూడు
పద్యమును బాడుగా నేల, ♦ బాగు బాగు
భవనములుగూడ నట్టి వై ♦ వన్నె కెక్కు. 19

తే. గీ. అచటఁ గలపూలవనముల ♦ యందు గల్గు
పూవు లెల్లను రక్కసి♦పూవుఁబోండ్లు
పూకులం దోఁపు కుందురు ♦ పుల్లమాన
నైన చో వానిఁ బొగడ నె♦వ్వానితరము. 20

తే. గీ. లంకఁ గలరాక్షసుల యొక్క ♦ బింక మైన
మేఢ్రములు పోఁకమానుల ♦ మించి యుండ

వారియాకారముల నేల ♦ వర్ణనంబుఁ
జేయవలె ప్రాజ్ఞు లెల్ల రి♦స్సీ; యనంగ 21

సీ. గడ్డికుప్పలఁబోలఁ ♦ గలయట్టి చన్నులు
కరిగర్భముల వంటి ♦ గర్భములును
బండిచక్రము లట్లు ♦ భాసిల్లు పిఱుఁదులు
గాన్గులం బోలిన ♦ కంఠములను
ఆదికూర్మముఁ బోలి♦నట్టి పాదంబులు
మందరగిరి వంటి ♦ మధ్యములును
బారలతోఁ గొల్వ♦నేరనియూరులు
జగతిలో లే నట్టి ♦ జంఘములును

తే. గీ. గల్గుకాంతల పూకులఁ ♦ గల్గి నట్టి
వెంట్రుకల దీర్ఘముం జెప్ప ♦ వేధ తరమె?
యల త్రికోణపుబిలముల ♦ యావరణాలు
లోతులం గన్నఁ గన్పట్టు ♦ నూతుల వలె. 22

తే. గీ. ఎట్టిచెలి యైన తనకొంగు♦నెత్తి యుచ్చఁ
బోయ నయ్యది యొకక్రోసు ♦ పొడవు బడును
పురుషులుంగూడ నట్టులే ♦ పోతురేని
మించుపో యంతకంటెను ♦ కొంచె మంత. 23

తే. గీ. పంగలం జాపి 'రా దెంగు ♦ దెంగు' మంచు
కొంగు లెగ దీసియాపురి ♦ కోమలాంగు
లంగడుల లోనఁ దిరుగుదు ♦ రనుదినంబు
దొరకుమేఢ్రంబు లెల్లను ♦ దోఁపుకొంచు. 24

తే. గీ. పురిని గల రాక్షసులు మేఢ్ర♦ములను జూచి
కొట్టునెడ తాళవృక్షముల్ ♦ గూడ నేల
పడుచు నుండుచు కాంతలు ♦ ప్రక్కఁ జేరి
దోఁపుకొందురు పూకుల ♦ లోపలగను. 25

తే. గీ. అట్టి లంకాపురిని గల్గు ♦ నట్టి దివ్య
భవనములలోన నొకమహా♦భవన మందు
వెన్కసానడిపడ్క్కను ♦ పెద్ద పూల
తోఁటలో కుంభకర్ణుఁడు ♦ తూఁగి యుండె. 26

సీ. ముకురంధ్రముల నుండి ♦ పోయివచ్చుచు నున్న
గాలిచే తరువులు ♦ గదలు చుండ
తొడలలో తామర♦మడిఁ బొరగోఁకగా
రజము కుప్పలు గాక ♦ గాలుచుండ
అప్పా డప్పుడు పిత్తి ♦ నట్టి యాపిత్తులు
గర్జనంబులబోఁతి ♦ గా నదింప
కనుఁగొలంకుల నుండి ♦ కాఱెడి పుసినీరు
ముద్దముద్దలు గట్టి ♦ పులియు చుండ

తే. గీ. నావులించిన భూతము ♦ లవలఁ బొఱ
నొత్తిగిల్లిన మృగములు ♦ సత్తువేది
పడ్కలం బడి మగ్గ న♦పార మైన
నిద్రలో నుండె నా రజ♦నీచరుండు. 27

తే. గీ. తనదు కులకాంత మిక్కిలి ♦ తత్తరమున
పూకు పై నీఁకె లన్నియు ♦ బుగ్గ తోడఁ
దీసికొని ముట్టుస్నానంబు ♦ చేసి తగిన
భూమలం దొడిగియుఁదాల్చె♦ పుట్ట మొకటి. 28

తే. గీ. పుట్టమును గట్టి నుదుటను ♦ బొట్టు పెట్టి
వేఁచి యుంచిన మాంసంబు ♦ వేడి దింత
నంజుకొంచును చద్దియ♦న్నమును గుడిచి
మట్టమధ్యాహ్నమున రతి ♦ మనసుకల్గి. 29

సీ. పట్టినొక్కము చల్లు ♦ గట్టిగా చేతుల
నంచు త్రైకను నడ♦లించినట్టు

ముద్దుబెట్టుము బుగ్గ ♦ మోహంబు రేఁగఁగా
నంచును మూతి కం ♦ దించు నట్లు
కౌఁగలించుము మేను ♦ కసిదీఱిపోయెడు
పగిది నంచును ముందు ♦ పడిన యట్లు
దూర్పు మిందున మొడ్డ ♦ దూల తీఱెడు రీతి
వే యని పూ కెళ్ల ♦ బెట్టి నట్లు

తే. గీ. స్వప్నముం గనె పాపము ♦ స్వేచ్ఛ మైన
కోటగుమ్మంబులా గున్న ♦ కొమ్మ యోని
కన్నులారంగఁ గాంచిన ♦ కారణమున
మొదలె నా కుంభకర్ణుని ♦ మేఢ్ర మంత. 30

తే. గీ. మొదలి యేతము వలె లేచి ♦ మిన్ను ముట్టె
నేరు వర్ణింప నేర్తురు ♦ యెత్తు చుట్టు
కొలత యిది యేమి యనుచును ♦ దలఁచి స్వర్గ
వాసు లెల్లరు దేవేంద్రు ♦ పాలి కేగి. 31

కం. దేవా యేమని తెల్పుదు
మీ వీట న దేమొ గాని ♦ యేర్పడె దానిన్
భావింపఁగ నిర్భేద్యము
రావలె నని వారు వాని ♦ రావింపంగన్. 32

తే. గీ. ఇంద్రుఁ డైరావతము నెక్కి ♦ యింపుగులుక
కుంభకర్ణునిమేఢ్రంపు ♦ గుంపుఁ జూచి
క్షణములోఁ బుట్టె నిది యేమొ ♦ స్వాంతమునకు
బోధపడ కుండె నని తాను ♦ బోయె వేగ. 33

తే. గీ. మన బృహస్పతి యెఱుఁగు నీ ♦ మాయ వాని
బిలువ నంపింతు నని యెంచి ♦ పిలువ నంపె
భటులకొందఱు వా రేగి ♦ వాసవుండు
తమకొఱకు మమ్ముఁ బంపె నో ♦ తాపసేంద్ర! 34

కం. అని పలుకఁగ విని యాతఁడు
మనమున సంతోష మంది ♦ 'మానిని! నే నిం
దుఁని జూడఁ బోవవలె, నీ
తనిఁ జూడుము ప్రీతి' నని సు♦ధానిధిఁ జూపెన్. 35

తే. గీ. ఎచటి కేఁగిన నీతని ♦ నేల నాకు
నొప్పఁ జెప్పెద రొకఁ మీకె ♦ యుండె నొకొ
వీనిపైఁ బ్రీతి నే లేని ♦ దానివలెను
గానుపించెద నే మీదు ♦ కన్నులకును?' 36

కం. అని వానితోడఁ బలికిన
విని యంత నతండు జరుగు ♦ విధు లరయుటలో
మునిఁగికొనియుండ తారా
వనితామణి యాత్మ నిటుల ♦ భావించుకొనున్. 37

తే. గీ. పోవఁ డింకేల నీ ముది♦ముండకొడుకు
జాము గా వచ్చె పిలుపంది ♦ జాగుసేయు
చుండె నని, పోనిలే యని ♦ సోగకనులు
చందురునిమీఁదఁ బఱపె నా♦చంద్రవదన. 38

తే. గీ. 'గురువుగా రేగుచున్నారు ♦ గురుని పనులు
బడియె నీ తలపైన నీ ♦భార మెట్లు
మోసెదవొ' యంచు దరిజేరి ♦ ముద్దు బెట్టె
తారకారాజు నా తార ♦ తాఁటితాఁటి. 39

తే. గీ. తారకారాజవా నీవు ♦ తార నేను
మనలమాత్రమె యుంచి తాఁ ♦ జనును కాదె
భయముచేతను నిద్దుర ♦ బట్ట దిఁకను
నీవునుంగూడ నా వంటి ♦ నియతిఁ గొనుము. 40

తే. గీ. పాడువేదమ్ము లెల్లను ♦ బఠన చేసి
చక్కఁదనములగొంతుక ♦ చక్కఁదనము

బాఢుజేయుచు నుంటివి, ♦ పాట నీకు
నేర్పెదను గాన నా యొద్ద♦నే పరుండు. 41

తే. గీ. అపరకర్మంబులను జేయు ♦ నట్టి వేద
మేల చదివెదు, ఛీ! నాకు ♦ చాలకష్ట
మట్టి వేదము వినదు వ♦హా! యి దేమొ
కాంచఁ గూడదె మతి కొన్ని ♦ గ్రంథములను? 42

తే. గీ. ఒనుగు చేయింతునో చిన్ని ♦ బుడుతవాని
కహహా! పెండిలి చేయింప ♦ నరుగువాఁడ
వా? వచింపుము యేటి కీ ♦ పాడువేద
మెవరు బోధించి రయ్యా నీ ♦ కిది వృథాగ. 43

తే. గీ. క్రొత్తవారలు దీనిని ♦ గొప్పగాను
భావనలు చేయు చుందురు ♦ ప్రాఁతవడ్డ
విసుగుకొందురు, పరు లేరు ♦ వినిన మెత్తు
రక్కటా! కైత గాన మా♦హావరింపు. 44

తే. గీ. కవన మబ్బుట నేర్పెదఁ ♦ గాక యున్న
వీణె నేర్పెద సంగీత♦విధుల లోన
బ్రాజ్ఞునిగఁ జేతు నేర్చుకో, ♦ పాడువేద
మెవరు మెత్తురు? దానియం ♦ దేమి ఘనత? 45

తే. గీ. కవన మల్లిన సంగీత♦కళ యెఱిఁగిన
పరులు కొనియాడు చుందురు ♦ పట్టుపట్టి
కామినులు నీదు కూటమి ♦ కై దలంతు
రయ్యయో? వేద మేల నీ ♦ యందమునకు. 46

తే. గీ. చదివితివి కావ్యములు కొన్ని ♦ చాల వఱకు
శాస్త్రములఁ జూచినావు ర♦సమ్ము లెల్ల
నేర్చితివి, గాన కవనము ♦ నేర్పె దేను
తాతతో మైత్రి మాని పె♦త్తనముఁ బూను. 47

తే. గీ. తాతపెండిలిఁ జేయఁగా ♦ తరలు నపుడు
పోయెదవె నీవు, బియ్యపు♦మూట మోయ,
చదువు చుంటివి వేదముల్ ♦ చాలు చాలు,
వేద మెటువంటిదో విన♦లేదు నీవు. 48

తే. గీ. భార్య పై రోఁతఁ బుట్టించు, ♦ భార్య యైన
పతిని మెచ్చని యట్లు చే ♦ ద్వరము, పరుల
కాంత నైనను మోహింపఁ ♦ గడఁగె నేని
వలవ ననిపించు వేదమ్ము ♦ వాస్తవమ్ము. 49

తే. గీ. ముష్టి నెత్తించు తుదకు సం♦తుష్టిఁ దుంచి
పొగను చెవులొట్టు రసికతఁ ♦ దగులఁ బెట్టు
ముదిమి గనుపించు రోఁతను ♦ ముట్టడించు
వెఱ్ఱివెంకన్నలకుఁ దప్ప ♦ వేద మేల? 50

తే. గీ. తాతతోఁ గూడి నీవును ♦ తాతబుద్ధి
నేర్చుకొన బోకు, నావలె ♦ నీదు భార్య
దుఃఖపడు నిన్నుఁగాంచియే ♦ తుదిని నేను
ప్రాణములతోడ నుంటె ని ♦ ప్పట్టు నందు. 51

తే. గీ. అనుచు క న్నీటు తన జాణ♦తనము జూచి
నంతలో చందురుఁడు వేగ ♦ నరిగె గదికి
తారయుం గూడ నాతని ♦ జేర నరిగి
కంచుకముఁ దీసి యా సుధా♦కరుని కొసఁగె. 52

తే. గీ. 'ప్రాణమా, వీపు పై జూడు ♦ మబ్బ! చీము
ప్రాఁకు చున్నది' యన వాఁడు ♦ బాలవీపుఁ
జూచు చుండఁగ పన్యాద♦చెంగు జార్చి
కసరె నాతయుఁ బరికింపఁ ♦ గా వలె నని. 53

తే. గీ. స్వర్ణమయ కాంతులం దేలు ♦ చాన వీపు
చేతితో రాయఁగా వాఁడు, ♦ చేడె మిన్న

'అచట గా దిచ్చ టచటగా ♦ దిచట' ననుచు
మెల్ల మెల్లనఁ దనచీరె ♦ నెల్ల విప్పె. 54

తే. గీ. 'ఇదిగో కంఠంబుపై బ్రాఁకె ♦ వెదకు' మనుచు
వస్త్ర హీనంబుగా వాని ♦ వైపు దిరిగె
పాప మాతండు కంఠంబు♦పైని చీమ
వెదకు చుండెను, వెదుక, నా ♦ విదుస్త్రిమోష్ఠి. 55

తే. గీ. బంగరపు బొంగరాలను ♦ భంగపడఁగఁ
ద్రొక్క గలయట్టి యా చను♦దోయి, వాని
రొమ్మునం జేర్చి 'యదిగో కం♦ఠమ్ము దాఁటి
మధ్య కరుదెంచె చూడు చీ'♦మనుచుఁ 'దాఁకి
తాచు' మని చూపె చన్ను తా♦గావధూటి. 56

తే. గీ. వస్త్రహీనంబు లై యున్న ♦ వనితచనులు
కన్నులారంగ వీక్షించి ♦ 'కాని చీమ
ప్రాకె నిదె' యంచు చన్నులఁ ♦ బట్టి యెత్తి
పానుపున నుంచి చంద్రుఁడు ♦ బలుకరించె. 57

తే. గీ. పానుపునఁ బెట్టి చన్నులఁ ♦ బట్టి మోవి
పలువిధమ్ముల నాని యా ♦ కలికి తమ్మ
లమ్ము నోటను గరచి వే ♦ నెమ్మి మీఱ
రతికిఁ దార్కొనె శశి యను♦రాగమునను. 58

కం. పట్టినచన్నులఁ బట్టుక
పెట్టిన యా పెట్టు మగుడి ♦ విడువక దానిం
దిట్టముగా రమియించెను
నెట్టిన తమకంబు తోడ♦నియతి దలిర్పన్. 59

తే. గీ. అంత నాతార వానిని ♦ పంత మూని
క్రిందికిం ద్రోసి పై కెక్కి ♦ పొందుచెందఁ

జేసి తమిహెచ్చి యుపరతి ♦ చేయఁ దొడఁగె
నెత్తి యాతని నెదుర్కొత్తు ♦ లొత్తు మనుచు. 60

తే. గీ. పికిలిపిట్టల విధమునఁ ♦ బెనఁగి పెనఁగి
జాగిలంబుల పోలిక ♦ సాఁగి సాఁగి
పాములట్టుల మెలికలు ♦ పడుచు విడుచు
సమరతికి నంతఁ దార్కొనె ♦ చాన తాను. 61

తే. గీ. ముద్దునకు ముద్దు తగు వల♦పునకు వలపు
దెప్పనకు దెప్ప తిట్టుకుఁ ♦ దిట్టు మఱియుఁ
గాటునకు కాటుగాను, చీ♦కాకు లంది
సమరతులఁ దేలిరంత నా ♦ చాన విభుఁడు. 62

తే. గీ. మూఁడురతు లిట్లు దేలి యా ♦ ముగుదమిన్న
చన్ను నొకచేతఁబట్టి యా ♦ చన్నుమొనను
వానినోటి కం దీయఁగ ♦ వాఁడు బాలు
మాడ్కిగాఁ ద్రావు చుండగా ♦ మందయాన. 63

తే. గీ. వాని తలఁబట్టి తనచన్ను ♦ వానిమెదను
నాను నటుసేయ వే ఱొక ♦ చన్నుమొనను
రెండువేళ్లను నుంపఁగా ♦ 'దుండగి' వని
ముద్దులం బెట్టె వానినె♦మ్మోము తార. 64

తే. గీ. 'మగువ కోరిన చనుపీయఁ ♦ దగదు యెంత
కైన' నన వాని పుట్టము ♦ నతిరయమున
లాగి వైచియు 'దెంగు వే♦వేగ' ననుచు
వానిఁ బ్రతిమాలఁ దొడఁగె న♦వ్వాఁడు వేగ. 65

తే. గీ. వస్త్రహీనంబుగా నున్న ♦ వనిత నడుము
బట్టి దరిజేర్చుకొనియె నా ♦ బాల వాని
క్రింద పడదోసి తన దగు ♦ క్రిందిపెదవి
చప్పరించియు నిలఁబడె ♦ యొప్పనటుల. 66

కం. నిలబడి నవ్వినదానిని
గని విభుఁ డతిలజ్జ చెంది ♦ కాళ్ల న్మ్రొక్కువ౯
వనితామణి విడదీయుచుఁ
గనుఁగొని చే వట్టి ముద్దు ♦ గమ్మని పెట్టె౯. 67

తే. గీ. ముద్దు బెట్టినతోడనే ♦ మొదటి తెఱఁగు
గాను చుల్లను నొకచేత ♦ నూని పట్టి
‘నీడ నాదా’ యటంచును ♦ వాద మాడి
‘నీదె’ యనిపించె వానిచే ♦ నెలఁత తుదకు. 68

తే. గీ. ‘నీవె యివి’ యంచు చన్నులు ♦ నేర్పుగాను
చేతులకు నిచ్చి ‘నాదిది ♦ చేతు’ ననుచు
మగుడ సంధింపఁగా జేసి ♦ బిగువు చూపి
కౌఁగిలించెను దగ్గర♦గాను జేర్చి. 69

తే. గీ. కూరుచుని యుండియే కొంత ♦ గొడవ జరిపి
యున్న కాంతను జూచి యా ♦ చన్నుఁగవను
బట్టి పడఁద్రోసి పై బడి ♦ బాలకు స్పృహ
దప్పు నట్టుగఁ గూడె ‘పె♦త్తనము గాదె?’ 70

తే. గీ. చన్నులం బట్టి పడద్రోయు ♦ చున్న యట్టి
సమయమున జ్ఞప్తి కలదు, పై ♦ సమయమునను
జ్ఞప్తి మాత్రము లేకయె ♦ తృప్తిఁ గనెను
నహాహా! యెంతటివాఁడు సు♦ధాకరుండు. 71

తే. గీ. ముద్దుఁ బెట్టుట యెఱుఁగదు ♦ మోము నెత్తి
పెదవి యానుట నెఱుఁగదు ♦ గదియఁ జేరి
రతి యొనర్చుట యెఱుఁగదు ♦ రాజు పాన్పు
దిగుట యెఱుఁగదు యేమని ♦ తెలుప వచ్చు! 72

తే. గీ. పాన్పు దిగి సోముఁ డలదాని ♦ వల్వ సర్ది
తాను తన పుట్టమును గట్టు ♦ తఱిని చనుల

కంఠమున గల్గు చెమ్మట ♦ కండువాను
దుడిచి యా పైన మూతిని ♦ దుడిచి వైచి. 73

తే. గీ. స్పృహ యొకించుకలే నట్టి ♦ సుందరాంగి
పగిది( గను(గొని పయ్యెద ♦ పైకి జేర్చి
చన్నుగవ( జూచి యివ్విరా♦చన్ను లనుచు
మొనలు ముద్దాడి మగుడను ♦ మూసి వైచి. 74

తే. గీ. చిక్కులం బట్టి కొనగోళ్ల ♦ చేత సర్ది
దువ్వి పేరులు సవరించి ♦ తొంగి చూసి
తిలక మెప్పటి రీతిగా ♦ దిద్ది, బట్ట
పూర్తిగా గప్పి తన దగు ♦ మోము నందు. 75

తే. గీ. కాంత కఱచిన యట్టి యా ♦ కాటు లన్ని
పరుల కన్నుల( బడ కుండ ♦ బాగు చేసి
కొంచు తన గోటినొక్కులు ♦ కొమ్మచనుల
యందు గల వేమొ యనుచు ప♦య్యంట నంత. 76

తే. గీ. పైకి తొలగించి వీక్షించి ♦ పడ(తి యేమి
కోపగించునో యంచును ♦ కొంత జడిసి
పొలుపు మీఱ(గ కస్తూరి ♦ పూసి పూసి
కడు విచారించె చంద్రు( డా ♦గాయములకు. 77

తే. గీ. ముద్దులను బెట్టి యలదాని మోవి యాను
చుండ(గా వచ్చె నంత గు♦రుండు, వాని
దక్కి చని 'యేమిసెల' వని ♦ 'దండ' మనిన
'నేమి కన(బడ దది యెట ♦ కేగె' ననియె. 78

తే. గీ. 'ఏడకుం బోవ లేదు, నే( ♦ డేమొ కాని
పండుకొనియుండె శాలువా ♦ పైన గప్పి
అమ్మగా'రంచు విధు( డన ♦ నత(డు వేగ
పాన్పు దరిజేరి యి ట్లని ♦ పలుక( దొడ(గె. 79

తే. గీ. 'ఏడ కేగెద నన్న నీ ♦ వెప్ప డిటుల
కడు విచారంబు నొందెదు ♦ కారణంబు
దెలుపు మొకయింత యింతలో ♦ పలనె వత్తు'
నంచు లేపుచు నుండె నా ♦ యతివ నతఁడు. 80

తే. గీ. పిలువఁగాఁ బిలువఁగా నది ♦ తెలివి వచ్చి
కనులు విప్పక, నేను నిన్ ♦ గందు నంచు
'తారకానాథ!' యంచును ♦ తార పిలువ
వచ్చి నిలఁబడ కన్విచ్చి ♦ వానిఁ గనియె. 81

తే. గీ. పాప మా తాత వేఱుగా ♦ భావ మందుఁ
దలఁచు నంచును 'తిండిపై ♦ వలపు నీకు
పుట్టదా చంద్రి బొత్తిగా ♦ భోజనమ్ము
మాను చుంటివి వ దేమి క♦ర్మమ్మొ కాని.

కం. నీకును నాకు విచారము 82
చేకూరు నటంచు నతఁడు ♦ చింతించకపోఁ
డా? కొంచెము చింతించిన
పాకారికి మనలపై కృ♦పా? తేరాజా!' 83

కం. అని విభునితోడ నను తా
రను గని గురుఁ డనియె 'కాంత!♦రయమున నే వ
త్తును గాన కోప మింతయుఁ
గొనవల' దని చెప్పి వెన్క♦కన్ దిరిగె నటన్. 84

తే. గీ. వానియాకారమును జూచి ♦ వారు నవ్వు
కొనుచు నుండంగ నెఱుఁగఁ డా ♦ గోలతాత
వజ్రిధరుసేవకులతోడ ♦ వాఁడు వోయె
తారకారాజు తారల ♦ తనివి దీఱ. 85

కం. తలకు నొకవస్త్రి మాపై
మొల నొంపొడికాయ ఫాల♦ముస బూడిదెయున్

గళమున రుద్రాక్షలునుం
గలవారలఁ జూచి నవ్వ • గడఁగరె రసికుల్? 86

కం. పగ లనక రాత్రి యనకయె
తెగ గూడుచు నుండె విభుఁడు • తికమక వడుచున్
తగురీతి నతఁడు విసిఁగిన
తగులుకొనున్ బట్ట విప్పి • తారయు నతనిన్. 88

తే. గీ. పూలతోఁటల మాలతి•పొదలలోన
పాన్పుపై, నేలపై చెంగుఁ • బఱచుకొంచు
పట్టపగ లింటతలుపులు • బయలు చేసి
మెలఁగు చుండిరి యే మనఁ•గలరు పరులు? 89

తే. గీ. అన్నిఁటికి యేమి గాని యా • యబ్జవదన
వంటఁ జేయుచు నున్న యా • పట్టు నైన
మనసుపుట్టిన మడి విప్పి • మరులుకొనుచుఁ
దగులుకొను చుండు విభుతోడఁ • దగవులాడి. 90

తే. గీ. ఎన్న డేనియు మడి విప్ప • దేని కాంత
'తొందరగ నున్న' దనుచు వి•భుని 'పటంబు
విప్పి ర' మ్మని వంటింట • వివిధగతుల
గూడు చుందురు మితిలేని • కూర్మితోడ. 91

సీ. స్నానంబు చేయించు • చలువపన్నీటను
పట్టుపుట్టము గట్టి • పెట్టు తానె
అన్నముం దినిపించు • నదె బ్రీతిమాలుచు
విడిచిన యన్నంబుఁ • గుడుచు తానె
తిలకంబు దిద్దు ము•ద్దులుమూటగట్టఁగాఁ
బీఁటపై కూర్చుండఁ • బెట్టుతానె
ముస్తాబు చేయును • మురువు కొల్పెడు రీతి
విడియంబు నోటను • బెట్టు తానె

తే. గీ. పాన్పు శుభ్రింబుగాఁ జేసి ♦ వచ్చి, స్నాన
మాడు నంచాక తనయొద్ద ♦ నతని నుండు
మనుచుఁ బార్థించి, తరువాత ♦ ననుపమాన
మైన తెఱఁగున ముస్తాబు ♦ లై చెలంగు. 92

తే. గీ. అంత ముస్తాబుగా తయా♦రౌచు త్రైక
మాత్రిమే తొడుగుమనుచు ♦ మాటిమాటి
కల్లవానిని బ్రతిమాలి ♦ యతనిచేత
కోరి తొడిగించుకొను చుండు ♦ కొమ్మ సతము. 93

తే. గీ. ఆతఁ డే నగ లిచ్చిన ♦ యా నగలనె
యాతఁ డేచీరనిచ్చిన ♦ యద్దిమాత్రి
మాతఁ డే త్రైక నొసఁగిన ♦ నదియ కాని
తాను మాత్రిము స్వాతంత్ర్య ♦ మూన దెపుడు. 94

తే. గీ. అది యతం డొక్క రీతి త♦యారు లగుచు
నిలువుటద్దంబు దరికేగి ♦ నిలిచి 'మనల
లోన బాగుండునది, నీవ ♦ నేన?' యనుచు
తగవు లొందుచు, తుద కెల్ల ♦ తగవు దీఱ. 95

తే. గీ. కేలుకేలను గొని వేగఁ ♦ బూలపాన్పు
దరికిఁ జని పైకి యెక్కి యా ♦ తలిరుఁబోఁణి
'నీవ నేనా' యటంచు న♦నేకవిధుల
బలుకఁ దొడఁగును సుధకారి ♦ మొలక లెత్త. 96

తే. గీ. దినదినంబును వా రిదే ♦ తీరుగాను
సంతతానందవార్ధిలో ♦ స్నాన మాడి
మెలఁగు చుండంగ నట దేవ♦తల గురుండు
వాసవునిఁ జేర, నిందుౖంచు ♦ వంగి మ్రొక్కి. 97

కం. అనఘా! యీ యుచితాసన
మున నుండు' డనిన దేవ♦ముఖ్యుం 'డటులే'

యని కూర్చుని 'పిలిపించిన
పని యెయ్యది' యనిన దేవ♦పతి యి ట్లనియెఁ. 98

తే. గీ. 'మొన్నటను లేదు, నిన్ననే ♦ మొలిచె నీడ
నెయ్యదో యెఱుంగఁగఁ గోరి♦యిపుడుమిమ్ము
పిలువనంపితి, మన మేగ ♦ వలయు' ననఁగ
నాతఁ డా యింద్రుఁ డిఁక కొంద ♦ రటకుఁ జనిరి. 99

తే. గీ. దేవగురుఁడు మహేంద్రుఁడుఁ ♦ బోవుచుండ
వారి వెనువెంటనే స్వర్గ♦వాసులెల్ల
రేగి రద్దాని గాంచి వ♦దించె గురుఁడు
'పార్వతీపతి లింగ మై ♦ వచ్చె' ననుచు. 100

తే. గీ. అనుచు నా కుంభకర్ణుని ♦ యనుపమాన
మేఢ్రముం జూచి గురుఁడు 'స్వా♦మీ' యటంచు
మ్రొక్క నత్తరి నందఱు ♦ మ్రొక్కు లిడిరి
తగినవిధిఁ బోల్చె గురుఁ డని ♦ తలచితలచి 101

వ. అప్పు డింద్రుఁడు. 102

తే. గీ. భటుల రావించి 'శివు డింద్రు♦పట్టణంబుఁ
గాంచ నరుదెంచి లింగంబు ♦ గాఁగ మాతొ
నెల్లవా రిట పూజించి ♦ యేగుఁ' డనుచు
చాటగాఁ బంచె పౌరులు ♦ సంతసింప. 103

ఆ. వె. ఇంద్రు నాజ్ఞ గాన ♦ నెల్లవారలు మన
సార నిష్ఠతోడ ♦ స్నాన మాడి
యింతకంటె భాగ్య ♦ మెయ్యది యని దాని
పూజ సల్పువిధులఁ ♦ బూనుకొనిరి. 104

తే. గీ. దేవతలు దేవకాంతలు ♦ దివ్య మైన
పగిది ముస్తాబు లై స్వర్ణ♦పళ్లెరముల

పత్రిముల్ పళ్లు పూవులు♦పలురకముల
ధూపసంభారములతోడ ♦ నేపు మీఱి. 105

తే. గీ. అటుల సుర లెల్ల రట కేగి ♦ నంతలోన
రంభ యూర్వశి మేనకా♦రమణు లెల్ల
ననువమానంబుగాను త♦యారు లౌచు
వచ్చు చుండిరి యంచల ♦ వలె చెలంగి. 106

తే. గీ. ఇంద్రుఁ డైరావతము నెక్కి ♦ వేడ్క మీఱ
దేవితోఁగూడ, తన వెంట ♦ దేవగురుని
నిల్చుకొనివచ్చి శివపూజ ♦ సల్పుట కయి
వచ్చు నత్తరి పలువురు ♦ వచ్చి రంత. 107

తే. గీ. కుంభకర్ణుని మేఢ్రంపు♦గుండు చుట్టు
కలుగుచర్మము పై దేవ♦గణము నిలిచి
యుండ, నింద్రుఁడు కులసతి ♦ నండనుంచి
గురునితోఁ గూడ వచ్చె నా ♦ గుండుదరికి. 108

తే. గీ. అట్లువచ్చి బృహస్పతి ♦ యధికవిధుల
మంత్రముల నెల్లఁ జదివి స♦న్మంగళముగఁ
జేసె నభిషేక మెంతయో ♦ చెలువుమీఱ
కుంభకర్ణునిమేఢ్రంపు ♦ గుండునకును. 109

తే. గీ. వాసవునినాతి చేతితో ♦ బట్టుకొనిన
యగరుపుల్లలు చేజాఱి ♦ యందుఁబడిన
కాలె నా గుండు, కాలగా ♦ కాంతిఁ దప్పి
వ్రాలి పోయెను చెప్పఁగా ♦ వశమె పైని. 110

తే. గీ. అందుఁ గొందఱు గెంతులే ♦ కతనిమేఢ్ర
మూఁతగాఁ గొని జాఱిరి ♦ యున్నవారు
స్వర్గమున నుండి జాఱెడి♦వారు మొదల
చిక్కగా నున్న నీఁకెలఁ ♦ జిక్కిరంత. 111

తే. గీ. ఈఁకెలం జిక్కి పైకి రా ◆ లేక వనిని
డాఁగియున్నట్టి మేఁకల ◆ పోగుగాను
మెదలుచుండఁగ నింతలో ◆ గదలె కుంభ
కర్ణుఁ డారవ మూసాంత◆కాలమునను. 112

తే. గీ. నిద్ర మేల్కని క్షౌరికు◆ని తనదరికిఁ
బిల్చి యాతనిచే తల ◆ ముందు బోడి
గాను చేయించుకొని మొల◆క్షౌర మంత
వానిచేతను జేయించి ◆ వరలుతఱిని. 113

తే. గీ. మంగలాతఁడు నారాచ ◆ మందిరమున
శప్పనుల నెల్ల పోగుగా ◆ చక్కఁ బరచి
వారినిధిలోన నా పోగుఁ ◆ బారవైచె
తేలి యేతెంచె దరిగల ◆ దేశమునకు. 114

తే. గీ. అందులో చిక్కువడిపోయి ◆ నట్టసురులు
సాగరప్రాంతమున నుండి ◆ సాగి రాగ
'హరిహరీ' యంచు నారదుఁ ◆ డల్లవారి
సురులుగా బోల్చి పేరు వ◆సుధకు నెటుల
దిగిరో యని మెంచి 'మీరలు ◆ దేని చేత
వచ్చినా' రన్న వారలు ◆ పలుక నిజము. 115

తే. గీ. కుంభకర్ణుని మేధ్రింపు ◆ గుంపువలన
భూమికిం దిగు సురు లౌట ◆ భూసురు లని
పేరు బెట్టుచు 'రాజులఁ ◆ జేరి మీరు
బ్రిదుకుఁ' డంచును వారల◆వరము జేసె. 116

కం. ఇటు వారి జేసి నారదుఁ
డట నుండి మహేంద్రపురికి ◆ నరిగిన నతఁడీ
పటుతాడనునకు మ్రొక్కిన
యట నాతం డనియె క్షేమ◆మా మాహేంద్రా! 117

తే. గీ. మౌనిచంద్రమ యే మని ♦ మనవొనర్తు
శంకరుఁడు మొన్న లింగమై ♦ స్వర్గభూమి
చూడవచ్చెను పూజించి ♦ వానిఁ బంప
గలిగినారము మా పూర్వ♦ఫలమువలన. 118

తే. గీ. పాకశాసనుఁ డీరీతిఁ ♦ బలుకునరికి
పక్కున నవ్వి యెంతటి ♦ పాపకృత్య
మాచరించితి! యది రావ♦ణానుజుఁ డగు
కుంభకర్ణుని మేఢ్రింపు♦గుండు సుమ్ము. 119

తే. గీ. రామ స్వప్నంబునను రాగ ♦ రాక్షసాధ
మునకు మేఢ్రంబు లేచి యీ ♦ పురము ముట్టె
దాని శంకరుఁ డంచును ♦ దలఁచి మీకు
గురుఁడు వలికెను నైదికీ♦తెఱఁగుఁ దోఁచ. 120

తే. గీ. అట్టి మేఢ్రంబు వ్రాలు చు♦న్నట్టితఱిని
మీర లెల్లరు స్వర్గంబుఁ ♦ జేరుకొనిరి
కొంద అలదాని నుండి యా ♦ కువలయమున
కరుగుఁ దెంచిరి నేఁ గంటి ♦ నచటవారి. 121

కం. సురు లయ్యును మేఢ్రముచేఁ
బరతెంచిరి భూమి కనుచు ♦ భావించుచు భూ
సురు లని పేరిడివారల
నరవరులకు నప్పఁ జెప్పి ♦ నాఁడ మహేంద్రా! 122

తే. గీ. అనిన విని సిగ్గు నంది దే♦వాధినాథుఁ
డయ్య, తాపసచంద్ర! మీ ♦ రమలమతులు
పరులతో దీని దెలుపఁగా ♦ వలవ దనుచు
సాగి మ్రొక్కెను సిగ్గుచే ♦ వేగ వచ్చి. 123

తే. గీ. వేగ నారదుఁ డేగి శ్రీ♦విష్ణుతోడ
బలుక నాతఁడు ధాతతో ♦ బలికె నంత

వాఁడు జని శివునికనె నా ♦ వార్త పూర్తి
ప్రాఁకె నయ్యది దిక్కులఁ♦పైన బాగ. 124

తే. గీ. భూసురాభిఖ్య కిదియెపో ♦ మొదటి కార
ణంబు శ్రీరామ! యెవరు ని♦క్కంబుగాను
దీనిఁ జదువుదురో వా ర♦నూన మైన
సంపదలతోడ నుందురు ♦ సర్వవిధుల. 125

కం. ఈకథఁ జదివినవారును
జేకొని యర్థంబుఁ జెప్పఁ ♦ జెల్లినవారున్
ప్రాకటముగ వినువారలు
శ్రీకరు లై యుందు రమిత♦శేముషితోడన్. 126

తే. గీ. పాండురంగనివిజయంబు ♦ బలికి వీర
జనమనోరంజనముఁ జేసి ♦ జగతి కాది
కారణం బైన వేంకట ♦ కథ రచించి
శప్పవిజయంబు జెప్పితి ♦ సత్య మనుచు. 127

ఆ. వె. ఏమమారు లెవ్వఁ ♦ డీకథ చదువఁడో
కుంభకర్ణుమొద్దు ♦ కడిచి నల్లు!
రామలింగసుకవి♦రాయఁ డిట్టుల వక్కఁ
గాన దప్పవశమె ♦ కలియుగమున! 128

గద్య. ఇది యాదిపురాణాదిసద్గ్రంథకార కృష్ణరాయదత్త తెనాల్యగ్రహార తెనాలివంశపవిత్రార్యజనస్తోత్ర మల్లిఖార్జున తనూభవ రామలింగనామధేయప్రణీతం బగు శప్పవిజయం బనుమహాప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.

కామగ్రంథమాల:— ౮ వ గ్రంథము.

# శృంగారపంచకము.

మ॥ రా॥ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారిచే రచింపఁ బడినజాబులు రెండుభాగములును, సరసోక్తియుక్త కృష్ణశతకమును, సరసచాటువులును కవిసార్వభౌమ శ్రీనాథకృత మగు రసికాభిలాషమును, పూర్వకవుల చాటువులు నిందుగలవు. 416 పద్యములు గల 112 పుటలపొత్తము. శైలికి కొన్ని పద్యములు.

జాబులు మొదటిభాగము. స్త్రీలకుఁ—బురుషులు.

చ॥ ఇఱుకు గ లట్టిదారి మన ♦ మిద్దఱ మొంటిగ తారసిల్లఁగా,
చిఱునగవొప్ప నీ భుజము ♦ చే నను ఁ జెచ్చెరఁ ద్రోసికొంచు నీ
వరిగిన నాఁటిచందమును ♦ నందము డెందము నందు నాటుటన్
మఱవక యున్నవాఁడనుసు ♦ మా కుసుమాంగి సుమాస్త్రి నాసగన్ ॥ 88

జాబులు— రెండవభాగము, పురుషులకు—స్త్రీలు.

చ॥ ఒడఁబడ కుండ నే బిగిసి ♦ యున్న దినంబులు నాదు పొందు కై
పడగను రానిపాట్లు పడి, ♦ పల్మఱు నన్ బ్రతిమాలుకొంటి; వి
య్యెడ మొగ మైన జూప విది ♦ యేమిర? 'యక్క అతీటి నంత, నె
క్కడపిరియు?' లన్న పాట వగ ♦ కాఁడ, యథార్థము చేసినాఁడవా ? ॥ 93

సరసోక్తియుక్త కృష్ణశతము:—

క॥ చేతమున దైవభక్తి ప్రిపూతం బగువేళ నిన్నుఁ ♦ బోలినదైవం
బీతటి నాకులభించుట, "ఆతులలోఁ దేనెపట్టి ♦ న" ట్లన్యోహరీ. 77

ర సి కా భి లా ష ము :—

మ॥ మగలా గీ వొక స్వప్నమందు నొనరిం ♦ ప, న్నేను సొంపారఁబై
కెగయం జేతులరెంట నీడుచనుదో ♦ యిం గట్టిగాఁ బట్టఁగా
నగి, "గోవర్ధనమందరంబులను శ్రీ ♦ నాథుండు నేఁ డొక్కసా
రిగమోపెం గనుఁ!, డంచుఁ బల్కితివి సం ♦ ప్రీతాత్మవై నాతిరో. 81

స ర స చా టు వు లు :—

క॥ మదనుఁడను స్వర్ణకారుఁడు పదకము చెలి తొడలనడుమ ♦ బాగుగ నిడి, యే
యదుకుం బెట్టెనొ? పగిలిన దది సీల బిగింపు లింక ♦ నవసర మయ్యెన్ ॥ 13

పూర్వకవులచాటువులు:—

చందాదారులకు పోష్టుఖర్చులతోసహా వెల. రు. 1-4-0

# శృంగార శతకము.



తోఁట విజయరాఘవకవి.

శ్రీరస్తు.

# శృంగారపద్యపంచాశత్తు.

[ స్త్రీవాక్యము. ]

ఉ. శ్రీకరుగా మహారసిక♦శేఖరుగా గరుణామయాత్మగా
లౌకికవైదికాది సక♦లాసుకలాపునిగా సుమూర్తిగా
బ్రాకటకీర్తిగా సకల♦పండితవంద్యగుణప్రవర్తిగా
లోకులు నిన్నుఁజెప్ప విని ♦ లోనయితింగద నీకు నాయకా! 1

చ. అలుకలు మానరా యధర♦మానర నిన్నెదనమ్మెదానరా
చెలిమిగ బల్కరా నెనరు♦జిల్కర కల్కియొయార మొల్కరా
యెలమిగ శేలరా రతుల ♦ నేలరకోపము తాళఁజాలరా
నెలవు గణింపరా కరుణ♦నింపర నా మనవాలకింపరా. 2

చ. పలుమరు దూతికాసమితిఁ♦బంచినరాక నె రా మనంబులో
పల నెనరింత లేక విరి♦బంతులుబంపిన నందుకోక యా
వలపులమందుమారి యిలు♦వంకలఁ జుట్టుటగాక దాని మా
యలకునుజిక్కి నాయమట♦రా యిటురా విటరాజశేఖరా! 3

చ. నిను గనుఁగొన్నదే మొదలు ♦ నిద్దురకంటికిరాదు కూడుగూ
రెనయఁగనింపుగాదు సఖు♦లెందఱు గూడిన ప్రొద్దువో దిఁకే
మనియెదఁ జిల్కవాదు మది♦నంటిన కామము నిల్వనీదు క్రొ
న్ననవిలుకానికూటముల ♦ నన్నలరింపర ప్రాణవల్లభా! 4

చ. నను బిగియారఁ గౌఁగిట మ♦నంబలరారఁగనుంచి మించి క్రొ
న్ననవిలుకానికూటముల ♦ నర్మిలిగూడిననాటి వేడుకల్
మనమున నెంచియెంచి యొక♦మాటు నినుం గనుఁగోఁదలంచి నే
బనివడి కాచుకొంటిఁ దల♦వాకిలియిల్లుగ జీవితేశ్వరా! 5

చ. అనఘుఁడ నిన్నుఁ బాసినది ♦ యాదిగ నే దిగులొంది కుంది నె
మ్మనమున గంది వందిగతి ♦ మాటికి మాటికి వేఁడుకొన్న నీ
మనసు గఱుంగదాయెఁ జల ♦ మా ఫలమా నను వంటి బేలపైఁ
గనికరముంచ కిప్పగిదిఁ ♦ గాసిలఁ జేసితి వేమి సేతురా? 6

ఉ. చిత్తజు మేల్ శరాళికి వి ♦ శేష వరాళికిఁ జల్లగాలికిన్
మత్త మరాళికిన్ శశిస ♦ మగ్రకరాళికి నిత్యముం ద్వదా
యత్తమనో విరాళికి శు ♦ కాళి పికాళికిఁ జిక్కి లింక నీ
చిత్తము నాదు భాగ్య మిఁకఁ ♦ జెప్పెడిదేమి రసజ్ఞ శేఖరా! 7

ఉ. నీసము దార బాహువుల ♦ నీటును మాటల గోటు నూగుదే
ర్మీసము తీరు మోముకళ ♦ మేటి విలాసము బొమ్మ బాగు మేల్
హాసము సౌరు నెన్నడయు ♦ యారము గన్నుల సోయగంబు ను
ల్లాసము నెంచి నమ్మది గ ♦ లంగెడు తాళనురా మనోహరా! 8

ఉ. నీ సరసత్వము న్నెనరు ♦ నేర్పును నోర్పును నీటు గోటులున్
నీసుగుణ స్వభావమును ♦ నీదు ప్రభావము నీ రసోక్తులున్
నీసొగసైన చర్యయును ♦ నెమ్మది నెంచి నిరంతరంబు బే
రాస నినున్ రతింగలియ ♦ నాత్మఁ దలంచెదరా సుహృద్వరా! 9

చ. ఎలమిని చిన్ననాఁడు మన ♦ మిద్దర మొద్దికఁ బల్లెకూటమం
దలి బుడుత ల్గనుంగొనఁగ ♦ దర్పకుసాము ఘటింపుచుండ నో
జలు గని మీకునుం జదువు ♦ సామును రెండొనఁగూడె నింక మీ
రలసితి రింటికేగి సుఖ ♦ మందు డటన్నది యాదిలేదుగా? 10

చ. కుసుమశరార్తికి న్నిగులఁ ♦ గుందితి గందితి వేఁడి వెన్నెలన్
భసలరవమ్ము లంజెవులు ♦ బ్రామితి నోమితి మేలు నీకుఁగా
విసువక నీ కువాదములు ♦ వింటిని నిప్పుడు నీదు పోడుముల్
మసలక నింకనైన రతి ♦ మన్నన నన్నలయింపు మో ప్రియా! 11

ఉ. చూడ వదేమిరా మొగము ♦ జూడ్కుల వేడ్కల రంగఁ జూచి మా
టాడ వదేమిరా మనము ♦ నందున జెందినయట్టి కోపమున్

వీడ వదేమిరా మిగుల♦వేడఁగ జూడఁగనుందువింతె నన్
గూడ వదేమిరా రతులఁ ♦ గోరిక లీరికలెత్త నాయకా! 12

ఉ. బాళి మనంబునం బొసఁగఁ♦బల్కిన నీదగు నోటిముత్యముల్
రాలునఁటోయి? నీదగు క♦రంబు గరంబు దెమల్చిపట్టగాఁ
బోలదఁటోయి? నిన్నుఁ బ్రియ♦పూర్వకమొప్ప రతిం గఱింపఁగా
జాలనఁటోయి? జాలమిఁకఁ♦జాలిఁటురమ్ము విటాన్వయాగ్రిణీ! 13

ఉ. చందురునందమొందిన ప♦సందగు ముద్దుమొగంబుడంబు ద
ళ్కుందనముం బెసంగు నును♦కుందనముం దులకించు మేను మేల్
జెందు మృదుస్ఫురన్మధువుఁ♦జిందురసోష్ఠ మొడందవిస్త్రితం
బందముజూడ నాత్మనెన♦యం దమి మీఱె విలాసమన్మథా! 14

చ. చిలుకలు గూయ దత్తరిలఁ ♦ జిత్తజుఁ డమ్ములనేయ గండు తేఁ
టులు విడిమ్రోయ వేడిగఁ గ♦డుం న్వడగాడ్పులు డాయఁ జందురుం
డలయక గాయ నీ విరహ♦మగ్గలమాయెఁ బరాకుసేయఁగా
వలదిఁక రార నావలపు ♦ వడ్డికిబాఱెడి ప్రాణనాయకా! 15

చ. సలిపితి వెంతయుం జెలిమి♦సంగతిమీఱ ననంగశాస్త్రముం
దెలిపితి వంతరంగమున ♦ దేవతగా నతిగౌరవంబునన్
నిలిపితి వెవ్వఁడు న్బళిర ♦ నిక్కము మక్కువ లల్లదానిపై
నిలిపితి విట్టి నీమనసు♦మర్మ మెఱుంగఁగనైతిఁ జెల్వుఁడా! 16

ఉ. మారుఁడు గ్రూరుఁడయ్యె నల♦మందసమీరుఁడు ఘోరుఁడయ్యెఁ గ
ర్పూరము వీరమయ్యె నల♦రున్శుకవారము వైరమయ్యెఁ గం
జారి మదారియయ్యె నిఁక♦నైన ననుంగరుణించి నాపయిం
గూరిమి మీఱఁగూడి రతిఁ ♦ గొబ్బున నేలగదయ్య వల్లభా! 17

ఉ. ఆసలుగొల్పి నిన్ను విడ♦నాడనటంచుఁ దుటారిపల్కులన్
బాసలుజేసి యిప్పు డెడ♦బాసి ప్రియం బెడరోసి దాని యిల్
డాసి మనోజుబారి ననుఁ♦దక్కఁగఁద్రోసితి వౌర యింక నీ
మోస మెఱుంగనయ్యెఁ జల♦మో మది నాపయి నాయకాగ్రిణీ! 18

చ. చిలుకలమూఁకకు స్మరుని♦చిల్కు లతాఁకుకు నంచరాకకుం
నెల బలుకాకకుం గడిఁది♦నెమ్మలకేకకు మావిమోకకుం
జలదళిపిఁకకుం సుమర♦జంబులసోఁకుకు గాలిఢాకకుం
గళవళమందితింక ననుఁ♦గావుము ప్రేమ భుజంగరత్నమా! 19

ఉ. కారము నీవు నమ్మరువి♦కారము నే నితరాంగనారతా
చారము నీవు నెంతయువి♦చారము నే నలకొమ్మ మెచ్చు సిం
గారము నీవు జాల నయ♦గారము నేను వహించి మించి యు
న్నార మటుండ నాయమగు♦నా రమణా మదనాభసుందరా! 20

ఉ. చెక్కిలినొక్కి మోవిసుధ ♦ చిక్కఁగఁ గ్రోలి కవుంగలించి స
మ్యక్కఠినస్తనద్వయము ♦ మర్దనముం ఘటియించి యూరువుల్
దక్క బెనంచి మేలి సుర♦తంబులలో నిరతంబు దేల్చు నీ
మక్కువ నెందు దాచితివి ♦ మంచిమె నీ కిటుసేత పల్లవా! 21

చ. సరగున నొక్కయూరువును ♦ సందిటనుంచి వెసం దిటంబుగా
బెరతొడ బైలుసేసి కుచ♦పీడనకుం గయిఁదార్చి పేర్చి తోం.
తకిట ధిత్త ధింధిమిత ♦ తత్త తళాంగని తాళమాన వి
స్ఫురిత మనోజనాట్యమున ♦ బొల్పుగ నగ్గఱగించ వేమిరా? 22

ఉ. కోపమదే మదేభవర♦కుంభకుచాయని కాయజాత సం
తాప నివారణోచితవి♦ధంబులు నాయెడఁ గాంతు వట్టి నీ
వా పలుగాకినాసవతి♦యందు మనంబిడి దానియింటనే
కాపురమున్నవాఁడ విల♦కాపురుషుంబలె భావజాకృతీ! 23

ఉ. ఓపడఁతీ! నిను న్విడువ♦నోప నటం చిటబాసఁ జేసి నీ
వా పగలాలి బాళిఁగని ♦ యాపగరాని విరాళిఁబూని నా
పాపము బోసుకోఁ దలఁపఁ ♦ బాడియె నన్నిటులేచ నాయమే
రా పగవాఁడవా యికను ♦ ఊపులు మానర పల్లవోత్తమా! 24

ఉ. అక్కట! నీవు నన్నిటుల ♦ నాటడీకత్రియఁ జేయఁగా మఱుం
డక్కటికంబు మాని చల♦మూని కనర్మదిఁ బూని తియ్యవి

ల్లక్కడి పూవుటమ్ముల వ◆హీనత నెమ్మొయిఁ గాడనేయ నే
నెక్కడు గాసినొంది తిఁక ◆ నేమనితెల్పుదు మారసుందరా! 25

చ. వలచితినిన్ను నే జిఱుత◆ప్రాయమునాఁడె మనంబులోపలం
దలఁచితి నన్ను నేలఁగల◆దైవముగా దమి గారవంబునన్
గొలిచితి రేబగళ్లు మదిఁ◆గొంకక నీ విడునట్టి యాజ్ఞలో
నిలిచితి నిట్టి నన్నదయ ◆ నీకు హితంబటరోరి నాయకా! 26

చ. కటకట! మన్మథుం డెదురు◆గా నిలువంబడి హుంకరించి యొ
క్కట కటకధ్వనుల్ ప్రబలఁ◆గా విలునమ్ములు జూపఁజూచితిం
దటదటమంచు బెల్లదరెఁ ◆ దా నిదె గుండియ యేమిసేతు నీ
విట విటరాయ వచ్చి వెఱ◆పెల్ల హరించి భరింపుమా కృపన్. 27

ఉ. ఎన్నఁడు నేర్చినాడవుర◆యీ మటుమాయల? తోఁటకేగి నే
గ్రన్నన వత్తునంచు నయ◆గారపుమాటల నమ్మఁబల్కి యా
చిన్నలమారి యింటి కటు◆జేరి రతంబొనరించి ప్రీతిసం
పన్నునిఁబోలె వచ్చితివి ◆ భావజమోహనభాసురాకృతీ! 28

చ. సరముల చిక్కులుం బెదవిఁ◆జాల్కొను నొక్కులు గందు చెక్కులుం
గర మరగంటి సొక్కులు మొ◆గమ్మునఁ గుంకుమచుక్కలు స్మరహో
త్తరమగు తత్తరమ్మునను ◆ దార్కొనువాక్కులు బెక్కులెంచ నీ
సరసత తెల్లమయ్యె నెఱ◆జాణవు టక్కులమారినాయకా! 29

చ. వలచిననన్ను మోహమను◆వారిధి ముంచియు నీళ్లకంటె బల్
పలుచన జేసినాడవు భ◆ళా! నెనరెంచనివాఁడవైతి నీ
వలపును దాచనైతి మరు◆వాడిశరమ్ము లురమ్ము గాడె నీ
చల మిఁక మాని పూని రతి◆సంభ్రమ మొప్ప భరింపుమో పతీ! 30

ఉ. నమ్మినదానరా నిను మ◆నమ్మున నిమ్మన నీకు నాడు మే
నమ్మినదానరా నను న◆యమ్మున నొమ్మన నేలకుండినన్
గమ్మనివింటిజోదు బల◆గమ్ములతో దన పూవుటమ్ముపా
ల్గమ్మని కంటగించు నల ◆ గాసికి నే నెటులోర్తుఁ దెల్పరా? 31

ఉ. నీదగు కౌఁగిటం బెనఁగ • నీగదరా యెద తాయిఁజేసుకో
గా దగునా మరుం డలుకఁ • గారియఁ బెట్టదొడంగె నిన్నునుం
గాదనువారలుం గలరె • కాసిలఁజేసిన నాయ మెప్పదే
యాదరవృత్తి నన్ను నిఁక • నాదుకొనంగ ననంగమోహనా! 32

ఉ. అమ్మకచెల్ల! యీవిరహ • మగ్గలమయ్యెను నాదుమేను నీ
కమ్మకసెల్ల దింక విను • మారడిసేయక వేగవచ్చి నీ
వమ్మకరాంకుకేళి నను • నాదటఁ గూడుము దానిబాసలున్
నమ్మకు రాపులు న్వలవ • ద న్మకురా ముకురాననాన్మరా! 33

చ. ఇల మగవారిమాట మది • నెంతయు నమ్మక వారిమాటగా
బలుకుట నిక్కమయ్యెను సు • బద్ధములన్నవి సున్నయయ్యె నీ
వలన నిఁకేమిసేతుఁ జెలు • వం బటవీసలిఁ గాయునట్టి వె
న్నెలయయి యున్నదో సఖుఁడ • నెమ్మి నసూన రతిఁ దేల్పకుండిరా.34

ఉ. నాయనురాగ మెంచ కిటు • నన్నలయించుట నీకు నాయమా
నా యనుమాన మించుకయి • నా మదినుంచక యున్నదానగా
నా యపరాధ మెన్నఁడయి • నా యొనరించితినా దపింపఁగా
నామెఁ బరాకుసేయఁదగు • నా యిఁక నా నెగులార్చి బ్రోవరా. 35

చ. కడకను స్వాతివర్ష కణ • కాంక్ష వహించిన శుక్తిరీతి నె
క్కుడురతి ఘాఘనోదయము • గోరు మయూరికభాఁతి నిచ్చనె
న్నడు కుముదప్రియాగమము • నర్మిలిఁగోరు చకోరిదారి ని
లడ భవదాగమంబునకుఁ • గాచితిరా విటవంశచంద్రమా! 36

చ. నుడిశెద నొక్కమాట సుమ • నోరతి నా రతినాథుకేళిలో
దడయక నన్నువంటి సుల • తాలలితాంగిని గూడితేని నీ
నడక సువర్ణమందున సు • గంధము గల్గినయట్లు గావున
న్విడువక నేలుమా నెనరు • వీడకుమా నలకూబరోపమా! 37

చ. చిలుకపలుమాయిరాతు పలు • సేతల నాతనికత్తికోతలం
గొలగొలలీను కోయిలల • కూఁతల తుమ్మెద దిమ్ముమ్రోతలన్

వలనగు వాతపోతముల♦వాతల వెన్నెల పెట్టు ఘాతలన్
దలఁకగనయ్యె నయ్యయిఁకఁ ♦ దద్దయు నొద్దిక నుద్ధరించుమా. 38

ఉ. ఎంతని వేఁడుకొన్న నొక♦యింతయిన న్మనరెంచ వౌర నీ
యంత కృపావిహీనుఁ డిల ♦ నారయఁ గల్గునె? దాని బోధనో
దంతములెల్ల నీమది స♦దా సుఖదాయి గురూపదేశసి
ద్ధాంతములయ్యెనో తెలియ♦దాయెగదా వగదార్చఁబోకురా. 39

ఉ. కంతు దురాపతాపహతిఁ♦గందితి గుందితి నింకనైన నా
చెంతకువచ్చి యిచ్చగల ♦ చింత యొకింతయులేక మాన్చి నీ
పంతము చెల్లగా సురత♦పద్ధతి నుద్ధతి నన్ను గెల్చినం
గాంతుఁడ!నిన్ను మెచ్చవలెఁ ♦ గాక వితాతరితీపు లేలరా. 40

ఉ. కంతుని నవ్వసంతుని మృ♦గాంకునిసంతుని నా నలావనీ
కాంతుని నజ్జయంతుని ము♦ఖాముఖిఁ గెల్వఁగఁజాలు రూపమా
వంతుని నిన్నుఁబాసి వల♦వంత నిదెంతని తాళుదాన నా
చెంత నిరంతరస్థితి వ♦సించఁగదే రసికావతంసమా! 41

చ. మనవి వినంగరాదఁటర ♦ మాటికి వేడిన నీమనమ్ములో
గనికర మింత లేదఁటర ♦ కాయజసాయకపీడితాత్మనై
తి ననఁగ నీకు వాదఁటర ♦ తియ్యని నా నునుమోవి యానర
మ్మని పిలువంగఁ జేదఁటర? ♦ హా రసికాన్వయవార్ధిచంద్రమా! 42

ఉ. నిన్నటిరేయి నాకలను ♦ నీ వల నీప్రియురాలిఁగూడి నా
యున్ననికేతనంబునకు ♦ నొయ్యన వచ్చిన నట్ల యంత నీ
వన్నెలివాక్షి యానతి న♦యమ్మున నన్ రతిఁగూడినట్ల క
న్గొన్నది నిక్కమౌనటులఁ ♦ గోర్కెలు గూర్చు భుజంగపుంగవా! 43

చ. మది నుడివోని కూర్మి నను♦మానము మానక సూనకార్ముక
ప్రదరవితానఘాతములఁ ♦ బొల్పడనీయవటంచు జాలు నె
మ్మదిగని యప్పుడుంటి నను♦మాఱము నాయెడఁబూని యక్కటా!
తుది గరుణావిహీనమతి ♦ దోపగఁజేసితి వేమిసేతురా? 44

ఉ. కామినినైన నన్నిటుల ♦ గాసిలజేయుట దోసమంచు నీ
యామినికైన వచ్చి మది ♦ నచ్చిన మచ్చిక నేలకున్న న
క్కాముని పూవుటమ్ముల వ♦కావకలై యెద వ్రయ్యనుందు నో
సామి! నెన ర్మనంబున వ♦శమ్ముగ జేసి యశమ్ము గాంచరా. 45

చ. స్మరసమరూప! మున్ను విరి♦శయ్యను దీయని నెయ్యమొందగా
నిరువుగ బవ్వళించి మన♦మిద్దర మంగజసంగరంబునం
గరము విచిత్రవైఖరులఁ ♦ గాంచుచు బిగ్గఁ గౌఁగలించి సౌ
ఖ్యరసనుధ న్మునింగిన వ♦గ ల్మది నెంచకపోతి వౌగదా! 46

చ. పొలఁతికి నొక్కరీతి మదిఁ ♦ బూసలలోపలి దారముంబలెన్
మెలఁగువిభుండు గల్గుట సు♦మీ తొలినోముఫలంబు భాగ్యమున్
దలకొనియున్నవారలకుఁ ♦ దక్కవ లేటికిగల్గు నావలెం?
బలుచదనంబు గంటి నిను ♦ భావమున న్నెఱనమ్మి సామిగా! 47

ఉ. సిరుజిరాయువున్ బల మ♦నింద్య నిరోగ దృఢాంగకీర్తి మే
ధాకలనానులబ్ధియు వి♦శుద్ధతర ప్రతిభ ప్రభావముం
బ్రాకటనైభవంబు రతి♦రాజగురూన్నత సత్కృపారతిం
జేకురుగాక నన్ను రతిఁ ♦ జేకొని యేలుమయా సుధీమయా! 48

చ. పొలుపగు పండుటాకు విడి♦యోని కడాని పసిండిపూత పో
కలును లవంగముల్ వలపు♦గప్పెడు కప్పురపల్కు లేలకుల్
చలువమిటెంపుగింజలు బ♦సం జెలువొందగ బైడితట్టలన్
వెలయఁగ నించితిన్ రతుల♦పీడె మొనర్తుము రార సామిగా! 49

ఉ. పుక్కిటిపీడెమిచ్చి నును♦పొక్కిలిఁ జక్కిలిగింతవెట్టి లే
జెక్కిలి నొత్తిముద్దిడి ఖ♦చిక్కని చక్కనిమోవినొక్కి నా
చొక్కపుగొప్పవట్టి తమి♦చొక్కన నక్కన నన్నుఁజేర్చి యా
చక్కెరవింటిజోదు నెర♦సాధనచే దనియించితౌ సఖా! 50

చ. అవనిని వారకామినుల♦కై మృదులాలితశబ్దయుక్తిఁ దోఁ
ట విజయరాఘవుండు బ్రిక♦టంబుగ నేఁబది వృత్తపద్యముల్

కవులలరన్ రచించె మిగు♦ల న్వగలాంధ్రుడు స్వకీయపల్లవ
ప్రవరులఁగూర్చి విన్నపము ♦ పల్కఁగఁ దా నుపయోగమౌటకున్.

[స్త్రీవాక్యము సంపూర్ణము.]

---

శ్రీరస్తు.

# శృంగారపద్యపంచాశత్తు.

[పురుషవాక్యము.]

ఉ. శ్రీపతిపుత్రశాస్త్రము ల♦శేష మెఱుంగుచు గూడుచు న్నెరా
యోపికమీద నున్న మన♦యొద్దికఁ గన్నులఁజూడలేక హా
పాపపుదైవ మిద్దఱిని ♦ బాపగఁజేసెఁ గటా! కఠోరుఁడై
యాపగరాని యీవిరహ ♦ మగ్గలమయ్యెఁగదే తలోదరీ! 1

ఉ. అప్రియమూని వచ్చెఁ గను♦మంచగమి న్ననులెత్తిఁజేసి దా
నప్రతిమ న్వనప్రియచ♦యంబదె తుప్రిల్లుచు బండుగొర్కచున్
దీప్రరతిన్ శుకాళి పర♦తెంచె నదే బలు గాముపోల్కి దా
నప్రభుఁడై మరుండు శ్రమ ♦ నందగఁజేసెఁ గురంగలోచనా! 2

చ. అలకలదొంట్ల నెన్నడల♦నంచల జూపులదూపుకోపులం
బలుకుల జిల్కల న్గెలిచి ♦ పల్కురు దన్గను రూపహీనుగా
నిలిపిన నిన్నెదుర్చుటకు♦నేరఁడు మారుఁడు నన్గలంచె బు
ష్కలముగు నీ పరిగ్రహము ♦ గల్గిన గెల్వనె వాని మానినీ! 3

ఉ. ఆవలరాయఁ ద్రొక్కుట న♦హంకృతి ఝంకృతిమీఱు నాదిచే
జేవ రహించు నించువిలుఁ ♦ జేకొని పైకొని యార్చి పేర్చి రో
షావిల మానసాప్తిఁ గుసు♦మాస్త్రపరంపర నింప నన్ను గై
కో వదియేమొ నీదు చను♦గొండల మాటున డాచి యోచెలీ! 4

ఉ. ఓరు పొకింతలేక దయ♦యుంచక క్రొన్ననవిల్తుబారికిం
దారిచి తేరకత్తె కను♦దారి చిరాకువడంగ మేలె నా
దారకశారికాపిక శు♦కాళులు గూయ వినంగజాల నా
హా రమణీ సుమాంబకుని♦హారమణీ రతిశాస్త్రనైపుణీ! 5

చ. కలుములు కొండలంత గలు♦గం గఠినాత్మత నర్థి కింత మే
ల్వోలయఁగనీక పైగమక♦ముల్దగి యాసలుగొల్పు లోభిరా
జులుబలె నీదు నిబ్బరఁపు ♦ జొక్కపుగుబ్బచనుల్మను న్మనం
బలయఁగఁజేయుచున్న వక♦టా! యకటాపికటంబు లేలనే? 6

చ. కటకట! వెన్నవంటి మది ♦ గ్రిన్నన ఱాయిగఁ జేసికొంటి వి
క్కటికితనమ్ము నాకయి ద♦గం దలకొంటివి నేరమున్న నొ
క్కట ననుఁబట్టి నీజడను♦గట్టి ఫెళేలని చెంపఁగొట్టి పు
క్కిటివిషమిచ్చి కౌఁగిట బి♦గించి సుశిక్షితుఁ జేయరాదటే! 7

ఉ. కోపమటే మనోజశర♦కుంఠితభావుఁడనైన నా మన
స్తాపము దీర్ప కూరక వి♦తా తరితీపులఁ బ్రొద్దుపుచ్చె దీ
పాపము మేరగాదు నయ♦భావముతో రతి నేలుమింక గో
కోపమచారుపీనకుచ ♦ సోదకమేఘకచా విలాసినీ! 8

ఉ. తాళఫలోపమానకుచ ♦ తాళఁగజాల నటన్న నింత కాం
తాళముబూన నీకు ఘన♦తా లలిమీఱ రతింగలంచి చిం
తాలసవృత్తి మాన్పక వి♦తా లఘుభావము గాంచెదేల కాం
తా! లవమైనఁ బ్రీతివల♦దా కలవా యిటువంటి కాగతుల్? 9

ఉ. చక్కెఱమెఱ్ఱు పక్కిదొర ♦ జక్కఁగ దా వడినెక్కి పూని తా
జిక్కనిచిక్కటారి మొలఁ♦జెక్కి మదిం దయఁదక్కి యొక్కటన్

మిక్కుటమైన యుక్కు గడు ♦ నెక్కున దక్కరిమారుఁ డక్కటా!
ముక్కునుమూతి జూడకిటు ♦ ముంచెఁగదే శరపాళి బాలికా! 10

ఉ. నామది నిన్ను జీవముగ ♦ నమ్మట కా పగరాలిపోలికం
గాముని కప్పగించితివి ♦ కట్టడిదాన! విధాత నీమనం
బేమిటిఁ జేసెనో యెఱుఁగ ♦ నింత దలంచినదాన వయ్యయో!
యేమిటి కింత నన్ను భ్రమి♦యించితివే వెలికూర్మలన్ మదిన్. 11

ఉ. నీ నునుమోవి నీతళుకు♦నిద్దపు టద్దపు ముద్దుచెక్కులున్
నీ నగుమోము నీకులుకు♦నిబ్బరపబ్బుర పుబ్బుగుబ్బలో
మానిని! చూడ కోర్వదర♦మా కరమా దరమాన మేనియా
మేనున మేనుఁజేర్చి రతి♦మేకొను మేనులుమేలుమేలనన్. 12

ఉ. పంకజగంధి! నీపెనవి♦పానక మానక తాళఁజాల నీ
మంకుతనమ్ము నెమ్మదిని ♦ మానకయుండుట నీతిగాదు నీ
వింక రయంబుతోఁ గుత మ♦దీప్సితముం గొనసాగఁజేసి నీ
కింకరుఁడైన నాపయిని ♦ గిక్కవహింపక ప్రేమనింపుమా. 13

చ. పలుకులముద్దు నెమ్మొగము♦బాగు పిఱుందులసోయగంబు జ
న్నులగమకంబు గన్నులవి♦నోదము జేతులసుందరంబుఁ జె
క్కులజిగి కౌనులేతవగ ♦ కొప్పువిలాసము మోవికోవి మై
చెలువము నామదిం దవిలి ♦ చిక్కులఁబెట్టెడు నన్ను యుగ్మకీ! 14

ఉ. భావజుఁ డుగ్రమూర్తియయి ♦ బాపురె! పచ్చని తెక్కపక్కెరన్
కీవివహించు జక్కిని వ♦డిన్ దుమికింపుచు నట్టిచేరి బ
ల్మావిచిగుర్చటా ఝుళుపు♦లన్నను దల్లడమంద జేసె నిం
కేవిధిఁ దానువాఁడ గృప ♦ నియ్యవె నాకభయంబు తొయ్యలీ! 15

చ. పిలుపుల యింపు ముద్దుగను♦పింపు జనుగవ యుబ్బరింపు జె
క్కుల చెమరింపు మై పులక♦గుంపు వదల్పని కౌఁగలింపు గ
న్నుల దయనింపు గేలుజడ♦సొంపు దలంపుల వేడనింపు నీ
కలయిక సొంపు నేమఱువఁ♦గాగలనా లలనావతంసమా! 16

ఉ. నీ సరసానులాపములు ♦ నీ రతిబంధ కళాకలాపముల్
నీ సొగసైన చూపులును ♦ నీ నెఱజాణతనంబుకోపులు౯
నీ సిరులూనులాసమును ♦ నీ మినుకారు తనూవిలాసము౯
నీ సునయానువృత్తము గ♦ణింపఁ దరంబటె మంజుభాషిణీ! 17

చ. ననిచిన వేడ్కతోడ నొక♦నాఁ డురుకాండపటాంతరంబునన్
ననవిలుకానిసాధన యొ♦నర్చుతరిం బరు లేగుదేర వా
రిని దెరబైట నిల్పి తగు♦రీతి నదుత్తరమిచ్చుచున్ననుం
గని 'పనిఁజూచుకొ'మ్మనిన ♦ కల్కితనం బెదనెంతుఁ గామినీ! 18

చ. సిగముడి వీడి కొప్పివ్విరులు♦జింద బొమల్ముడివెంద నందమా
మొగమున స్వేదబిందువులు ♦ మూఁగ సరమ్ములు దూగ నూర్పు లె
చ్చఁగ గుచముల్ నటింప గటి ♦ సందడిసేయ వలగ్న ముల్కగా
జిగిబిగిమీఱ నీవు మగ♦సేత యొనర్చిన దెంతుఁ గామినీ! 19

చ. వెలఁదిరో!యొక్కనాఁడు మగ♦వేసము దాల్చి వినోదలీల వె
న్నెల చెలువారగాయుతటి ♦ నీవు ననుం గయిదండబూని స
న్నల నరుణాచలేశుతిరు♦నాలఁ గనుంగొనవచ్చు నీమ చి
న్నెలు బలువన్నెలుం దలఁప♦నేర్తునె నెమ్మదిఁ బాటలాధరీ! 20

చ. మదనునిబారి కోరువక ♦ మాటికి నీ చనుగట్టు డాసి త
త్సదనముపై గరంబిడ వి♦సర్జనసేయుచు జూడ కావల౯
వదనము దిప్పి మెత్తపడు♦నన్ను బడంపడి చూచి నవ్వి పై
కదనున జేరి కూడినహా♦య ల్మది యాదికి వచ్చునే చెలీ! 21

ఉ. కమ్మలడాలు చెక్కుల ధ♦గద్ధగలీన దనూరుచుల్దిశల్
గ్రమ్మ బులాకి ముక్కున ద♦ళత్తళలూన లసన్నిటాల భా
గమ్మున దళ్కుబొట్టుఁగాఁ జ♦కచ్చకలూన నటించు నాఁటి నీ
యొమ్మెల నేఁ దలంతు రమ♦ణీ తరుణీహరిణీసులోచనా! 22

ఉ. సొరుదొరంగు కాశి బురు♦సాపనిచీర ధరించి హా న్బుటే
దారిహారంగుపైక బిగి ♦ దట్టపు గుబ్బపయి౯ బిగించి యూ

దా రవరంగు చౌకము ముందంబున గేల ధరించి చాల నొ
య్యారపులీల నాకడఁ బ్రియమ్మున నిల్చిన దెంతు బాలికా! 23

ఉ. ఫ్రించిబుటాహరంగుగల పావడపై గుజరాతి హజ్జరీ
యంచు రహించుచీర చెలువారగ మల్చవుజంటకుట్టు రా
ణించిన జంటజాలరవిక నిగ్గులుదేఱఁగ నొక్కనాఁడు నా
యంచున నిల్చు నీదుసొగ సాత్మఁ దలంచెద హంసగామినీ! 24

ఉ. గుత్తపుతాపితారవిక గుబ్బగవన్నెలు డంబునింపగా
ముత్తెపుమేల్సరంబు యురము న్మెఱయింపఁగ జాఫరాపసల్
హత్తినపావడం దళత శ్లగ్నునారణిచీర గుల్కగాఁ
జిత్తజు మత్తదంతివలెఁ జేరవె నన్నును బంభరాలకా! 25

ఉ. నిగ్గులుదేఱు సొరు కుతి నీజిగిపావడపైని వెల్లజాల్
సగ్గనివల్వఁ గట్టి బిగి చన్నుల వన్నెలరైకఁ బూని మో
మొగ్గని చాదుబొట్టు దగి యొప్పఁగ ముద్దులుగుల్క నాకడన్
జగ్గుమనంగ నిల్చిన పసందుఁ దలంచెద సుందరీమణీ! 26

ఉ. చూపుల కింపొనర్చు నెఱ సోయగ మూని కడిందివేశ్యతో
దోపులుగాగ నొక్కనిశి దొమ్మిగ నిద్దర ముద్దిమీఱ పూ
దూపువజీరుసాధన లెదుర్కొని సేయఁగ నీవు షైలవా
న్కొప్పు లెసంగ నన్ను బయి కొన్నవగల్ మరువంగ నేర్తునే? 27

ఉ. జానుబొసంగ మేన జిగి సాపొడి నల్గిడి కీనుకాబు న
ద్దానవురారు పావడ నితంబునం దగ హజ్జరీ కుసుం
బా నెఱిచల్వ మేల్ముసుఁగు వైచి తురుష్కవధూటిపోల్కి చా
నా! నను గూడలేదె యొక నాఁ డది నామది నాటకుందునే? 28

ఉ. సంపఁగినూనె నున్మెఱుఁగు జాల్కొన గొప్పిడి యందు వాసనల్
నింపెడు పూవులం దురిమి నెన్నొసటం దిలకంబు గన్నులన్
సొంపుగ గజ్జలం బెసఁగ సొమ్ములమూని శరాయిపూని నీ
వింపుగ నాదుచెంగట రహించిన దెంచెదఁ జంచలేక్షణా! 29

ఉ. కులుకు మిటారపు న్వలుద♦గుబ్బలు కేలవనూని తేనియల్.
జిలుకు తువారపుం బెదవిఁ♦జీకుచు నూరువులూరువుల్ నెరా
మెలకువతోఁ బెనంచి రతి ♦ మేకొని మై పులకింపఁ బావురా
పలుకులు పల్కఁగా వినెను♦భాగ్యము గూర్పకపోతి వంగనా! 30

ఉ. నిన్ను మనమ్మునన్ దలఁచి ♦ నీరజనాయక సాయకాహతిన్
ఖిన్నతనొంది నీ ప్రియస♦ఖి న్నతవృత్తిని బాతిమాలి నీ
యున్న నివాసభూమికి న♦యోన్నతిఁ దోడుకపొమ్మటన్న నా
విన్నప మాలకింప కది ♦ వేఱుగఁ జూచెగదే మనఃప్రియా! 31

చ. అమవసకంచు నీ వరుగ ♦ నంతటనుండియు దాళలేక నే
సుమశరుబారి జిక్కి కడు♦సుక్కి మహా విరహాగ్నిఁబొక్కి బ
ల్తిమి తలకెక్కి ధైర్య మెడఁ♦దక్కి దురంత నిరంతరానుతా
పమున గలంగినాడ ననుఁ ♦ బాలన సేయఁగరాదె ప్రేయసీ! 32

ఉ. విందుఁగదా భవన్మధుర ♦ విశ్రుతవాక్యపరంపర ల్సదా
విందుగదా తవాధర న♦వీన సుధారసధార లెప్పుడుం
గందుఁగదా సుధాకర స♦ఖంబగు నీదుముఖంబు నంటినం
గందుఁగదా లతాంతమువ♦గందగు నీ నునుమేను కోమలీ! 33

చ. అతివరో! నీదుపొందు సత♦మంచు మది న్నెఱనమ్మియున్న నా
మతి పరీక్షింపలేక పలు♦మారు ననుం బెఱవానిగా మనో
గతులఁ దలంచి నీవు కని♦కారము మాని పరాకొనర్చి బ
ల్వెతలఁ గలంచినావు హిత♦మే యిదినీకు? వినీలకుంతలా! 34

ఉ. కాయజుఁ డమ్ము లేయఁ జిలు♦కల్ రొదసేయ మరుత్కిశోరముల్
డాయ మధువ్రతంబులు చె♦డాచెడిమ్రోయ వనప్రియంబులుం
గూయ జకోరమిత్రుఁడెదఁ ♦ గొంకక వెన్నెలగాయఁ దాళరా
దాయె మనంబునం దమక♦మగ్గలమాయె సుధాకరాననా! 35

చ. కుసుమసుగంధి స్వర్ణనిభ ♦ కోమల దేహలతా సుబాహ సా
రసదళనేత్రిఁ గంబుగళ♦రాజముఖి న్నవపల్లవాధరన్

భసలవినీలకుంతల సు♦భద్రి గజేంద్రసమానయాన ని
న్నసదృశమైనప్రీతి మది♦నంటఁగ వర్ణనసేతు సుందరీ! 36

చ. కపట మొకింతయేని మదిఁ♦గల్గదు నీ కని నమ్మియుంటి నా
కీపు డెఱుఁగంగవచ్చె నిఁక ♦ నేటికి మాటలు చాలుజాలు నీ
కృప బలమయ్యె నావలపు ♦ గెలియొనర్చితి వెట్టులైన నీ
వపరిమితంబులైన సిరు♦లంది సుఖింపఁగ గోరుదుఙ్ సఖీ! 37

చ. రమణి! మదీయ మోహతిమి♦రంబు భవన్ముఖ పూర్ణచంద్రబిం
బము గనుగొన్నఁ బాయునని ♦ బాళిమెయి న్నినుఁ జేరవచ్చినన్
విముఖత జూప న్యాయమగు♦నే? యిఁక నేవగ నే సహింతు నీ
తమకము నన్ను సాదర హి♦తస్ఫురదుక్తులఁ దేల్చరాదఁటే? 38

ఉ. సమ్మతిమీఱ నీ చెలిమి ♦ శాశ్వతమంచు మనమ్ములోపలన్
నమ్మితి మున్ను నమ్మ నెల♦నాగ లపైఁ గల కూర్మిలెల్లఁ బోఁ
జిమ్మితి నిన్ను నెప్పు డెదఁ♦జేర్చితి నిట్టి ననుం దుటారివై
గమ్మనివింటివాఁ డిడెడు♦గాసికిఁ బాల్పడఁ జేసి తౌగదే! 39

ఉ. కొమ్మ! నినున్ రతిం గలయఁ♦గోరి సమీపముజేరి నన్ను జే
కొమ్మని మేనితాపమర ♦ గొబ్బునఁ గమ్మని మోవిపానక
మ్మిమ్మని కాముసాదనల♦కిమ్మని నెమ్మిని వేఁడుకొన్నఁ బో
పొమ్మని యీగతిం గసరఁ♦బోలునె నన్ను దయావిహీనవై? 40

ఉ. నవ్వులకాదుమాటల మ♦నమ్మునఁ గిన్కవహించి యూరకే
రవ్వలఁ బెట్టఁ జూడకు తి♦రమ్ముగ నా మనవాలకింపవే
చివ్వకు కాలుద్రవ్వకవె ♦ చేసినతప్పు శమింపరాదఁటే
పువ్విలుకానిబారి ననుఁ ♦ బొక్కఁగఁజేయకు కంబుకంధరీ! 41

ఉ. మంచిగుణంబుకల్గినది ♦ మాట యొకింతయు దప్ప దెంతయున్
వంచనలేదు కూర్మి మది♦వాడగనీదుఁ మనంబు నిర్మలం
బంచుఁ దలంచి నీ కహర♦హం బొనరించితి సేవ యందుకా
పంచశరాంబకప్రహతిఁ ♦ బాల్పడఁజేసితి హా కళావతీ! 42

ఉ. కెంపుకనుల్ గనంగ నుడి♦కింపకు సారెకు మారుబారిఁ బొ
క్కింపకు వేఱుగాఁగ బరి♦కింపకు నమ్మినవాని నిట్లు జం
కింపకు లేనిపల్కు లొలి♦కింపకు నేరములున్న నాత్మ నం
కింపకు బల్విరాళి నళి♦కింపకు బెంపకు కిన్క తొయ్యలీ! 43

ఉ. ఇంపుదొలంగి సారె యల♦యింపకు మారుని రేచ నన్ను డా
యింపకు కోప మిచ్చ వెల♦యింపకు మున్నటి నేస్తమెల్ల మా
యింపకు బోవఁదల్చి విన♦యింపకు నీ విరహాగ్నిఁ గాసి సే
యింపకు మీర్ష్యబుద్ధి వహి♦యింపకు మ్రొక్కెద నామనోహరీ! 44

ఉ. నిద్దురవోవ నిన్నుఁగని ♦ నెక్కొనుమోహము నిల్పలేక నీ
ముద్దుమొగంబుపై మొగము♦మోపిన యంతనె కన్నువిచ్చి న
న్నొద్దికఁ గ్రుచ్చి కౌఁగిటను ♦ నూరక రక్తిఁగఱంచ కూరకే
గద్దరిపల్కులం గనరఁ♦గావలెనా? లలనాశిరోమణీ! 45

ఉ. 'కంటకవృత్తిఁ దుంటవిలు♦కాఁడు బలంబుల వెంటనంటి పూ
వింట శరంబులూని వెను♦వెంట ననుం దఱుమంగఁజొచ్చె వా
ల్గంటిరొ! యొంటిఁ జిక్కితిని ♦ గావవె జంటవహించి' యన్న 'న
న్నంటఁగరా' దటంచు మొగ♦మావలఁ ద్రిప్పెద వెంత దంటవే? 46

ఉ. అంటిన మేను గందునఁటె ♦ యాసబొసంగఁగ మోవి ముద్దు నే
గొంటనె తేనె చిందునఁటె ♦ కోరిక లూరగ నీముఖాబ్జముం
గంటనె దృష్టియొందునఁటె ♦ గారడముల్ బచరించి సారెకుం
గొంటుతనంబునన్ మరుని♦కోలలఁ దార్చకు ప్రాణనాయకీ! 47

ఉ. నా పలు కాదరింపవు ఘ♦నంబుగ బ్రేమము నింప వెంతయున్
గోపము డించ విచ్చగల♦కోర్కె వచింపవు నాదు చిత్తసం
తాప మడంప వాత్మ నను♦తాపము బెంపవు వేఁడవేఁడ రా
రాపులు జేసె దింతపొగ♦రా నగరా వగదానవా? సఖీ! 48

ఉ. వేమఱుఁ గిన్కబూనఁ దగ♦వే మరుధాటికి దాళఁజాల రా
వే మరులూనినాడఁ గద♦వే మఱుఁగేటికి కోర్కెఁ దెల్పవో

వే మఱపేల నేలుకొన♦వే మరుమాటలనైన దెల్పవే
వేసురులున్న వే నుడువ♦వే మరలించవె మోము నాదెసన్. 49

చ. విచికిలగంధి! నీపెదవి ♦ విందొనరించి విజృంభొసంగి నీ
రుచిర కుచోరుతల్పమున ♦ రూఢిగ నన్నువళింపఁజేసినన్
రచనలుమీఱ బంధకళ♦ల న్నను గూడితి వేమిదెల్పుదుం
గచరుచిధూత మేచకఘ♦నా వికచాంబుజపత్త్రలోచనా! 50

చ. భువి విటకాండ్రి కింపు మదిఁ♦బుట్టగ స్వోచితవృత్తిమీఱఁ దోఁ
ట విజయరాఘవాఖ్యకవి ♦ డంబుగ దా రచియించె హృద్యమా
ర్ణవ రసపూర్ణలాలిత సు♦ధా మధురోక్తుల రక్తిగుల్కఁ గా
రవమున జేకొనుండు కవి♦రాజులు తప్పులు పట్ట కెంతయున్.

[ పురుషవాక్యము సంపూర్ణము. ]

---

ఐదవ గ్రంథము.

# రతిరత్న ప్రదీపిక.

మైసూరుప్రభువగు ప్రౌఢదేవరాయలు రచించిన రతిశాస్త్రము:
సంస్కృతమూలము, ఆంధ్రవివరణము.

● ఇతర కామశాస్త్ర గ్రంథములందు జెప్పఁబడని ఔప రిష్టకవిధానములిందు వివరింపఁబడినవి. బంధభేదముల నిరూపించు పాశ్చాత్య ఛాయాచిత్రములు జేర్పఁబడినవి. అత్యుత్తమమగు కామకళానిబంధనము.

అనుబంధము.

# దత్తాత్రేయ తంత్రము.

● యోగిపుంగవుఁడగు దత్తాత్రేయునిచే ననుగ్రహింపఁబడినది. వాజీకరణ, స్త్రీవశ్యవిధానముల క్రింద నేక అనుభవ యోగములుగలవు. ప్రత్యక్షఫలమిచ్చు, రసికజనోపకారి యగు గ్రంథము.

## వెల రెండురూపాయలు

కామగ్రంథమాల. పుదుచ్చేరి.

అనుబంధము.

# మదనార్ణవము.



విజయరంగచొక్కభూపాలుఁడు.

రచనావిధానంబున కుదాహరణంబుగా

రతిమంజరి చెప్పిన మూఁడవనాఁటికథలోఁ

గొంతభాగము.

......అంతఁ గామరూపదేశాధీశు ననుంగుపట్టి యగు రతిమంజరి, సురతకళావిదగ్ధయయ్యును, ప్రౌఢతనంబు మాటువఱచి ముగ్ధభావం బభినయించుచు సిగ్గుచే మాటలు తడంబడినటుల గాద్గదికంబు నెపంబున గౌరవంబుల దనకుంగల జాతుర్యమును జాటుచూ, సపత్నిమండలంబును వేడుకలఁ గొంతతడ వాయాసపఱచి, మెట్టకేలకు బలవంతంబున నియ్యకొనినదానింబలెఁ బ్రసన్నభావంబున, పొగరెక్కి యుక్కుమిగులు గుచంబుల బయ్యెంట సరిదిద్దు నెపంబున నదిమికొని, యిటుల మొదలిడినది.

నాతొలికూటమి చిత్రవిచిత్రగతుల, చిత్రరతుల, జతనుపడినది. మానవాంగననైన నాకుఁ గన్నెచెఱఁబాపు, భగము నెంగిలిచేసినది, మానవుఁడు కాదు! నమ్రత్తలాడిన కన్నెప్రాయమున చూపరుల నోరూరించు రూపవైభవంబుతోఁ జెన్నారుచుఁ దలిదండ్రుల కేకైకపుత్రినైనందున, లోకమునందలి రాజకుమారికలఁబలె నంతిపురంబునఁబడిమ్రగ్గుచు నసూర్యంపశ్యనుగానుండక, వారలనుమతింపఁగా, మగవానిఁబలె, నొంటిమై, తలఁచినప్పుడెల్ల దూరవనులకు విహారముగానేగ నలవడియుంటిని.

నాకప్పటికి పదునెనిమిది వత్సరములు. ఋతుమతినై మూఁడు దినంబు లిలువెడలనందున, నాలవనాఁడు స్నానానంతరము, మిక్కిలి యుత్సాహముతో, ననుదినముకన్న నెక్కుడుదూరముపోయి, వాజిండిగ్గి, యలసినదాననౌట, కొండదరినంటి ప్రవహించుచున్న సెలయేటియందు, నగ్ననై యిచ్చవచ్చినగతి నీఁదులాడుచు, వారిక్రీడ మార్గాయాసం బపనయించునటుల నొనర్చి, నీరంబులువెడలి యొడ్డునకుఁజేరి, నామేని బంగరునకుఁ జికిలిమెఱుఁగులుదిద్దు, భానుని తరుణారుణాతపంబున నొడలు విరుచుకొనుచు నిలుచుంటిని. నాకన్నుల కదేలకో ప్రకృతి పులకరించినగతి, వనీస్థలులన్నియుఁ దొంటిబలెఁగాక నెక్కుడు మనోహరంబులై గన్పట్టినవి. నాయమాయికహృదయమునం దనుశ్రుతితో, రూపేర్పఱుపరాని మధురభావనలు దోఁచినవి. ఒడలెల్ల నెందులకో బరవశింపఁజొచ్చినది కలలు నిండుచూపులతో మదాలసతను మందంబుగా సింహావలోకనము

గావించు, నాకినుఁగవకు, నన్నాశ్చర్యాంబుధిఁ దేల్చుదృశ్యం బా సుముహూర్తంబున, నదే మొదటిసారి, యల్లంతదూరంబున గోచరించినది.

ఆఁడులేడి యొకటి కేళ్లుఱుకుచువచ్చి నదీతీరంబున నిలువంబడి బెదరుచు నటునిటుఁ జూడఁ బొచ్చినది. ఒకపొదమాటుఁగునుండి మగలేడి, చిలవలుపలవలైన కొమ్ములు, తీవలనుండి చిక్కువడకుండఁ దప్పించుకొనుచూ దానిం దరియవచ్చినది. హరిణి పాఱిపోవుననుకొంటిని, కాని యటులఁజేయక చిఱుతవాలంబు నాడించుచూ, నాహ్వానించుచున్నటులఁ దోఁచినది. మగది, పెదవులతో నాఁడుదాని మేనుఁ దడిమికొనుచు, పిఱుందకువచ్చి, పృష్ఠంబును మూర్కొనుచు, ముట్టెగదలించుచూ పైకి మెడనెత్తుచూ, పాదంబుతో నేల రాయుచూ, మఱల మొదటిచోటనే మూర్కొనుచునుండి, యొక్కయురుకున దానిమీఁది కెగరినది. అటుల నొకదానిమీఁద నొకటియుండి కొంతదూరము పరుగెత్తుటలో పట్టుదప్పి యాఁడులేడి, పాఱిపోయినది. మగది, యుదరంబుక్రింద నూఁచవంటి దాని నొకటి మాటిమాటికి నిక్కించుచు నుండినది.

నేనంతవరకు నేయొచ్చెమునులేక నమాయికముగాఁ బెరిఁగినదాన నగుట విరించి యేయే యవయవంబు లెందుకొఱకు నిర్మించినాఁడో వాని నుపయోగించుకొనుట యెటులో దెలియదు. కాని యప్రయత్నంబుగా నాచేయి భగోపరిభాగంబు దాఁకినది. అచ్చటనంతయుఁ జెమ్మగిలి తడిసి యుండినది. నాకా వెనుకముందులెఱుఁగని యావేశములో నొక వింతయాలోచన దోఁచినది. నే నాఁడులేడివలెనైనచో నదియేమి చేయునో జూతమనిపించినది. సమీపించి, దానిఁ దాఁకుచు నేలకు వంగితిని. వంగుటయేతడవుగ నాలేడి నామీఁదకెగిరి, వెన్నున ముంగాళ్లదిమినది. నా పిఱుందులసందున నేదియో జొరఁబడి వెనుకకుపోయి, కలయఁగ్రుమ్ముచు, స్థానము వెదకుకొని, భగము పెదవులఁదాఁకి, గ్రుచ్చుకొని లోనికిదిగఁజొచ్చినది. నాకుఁ దమి హెచ్చి, వెనుకకు నడుమునూఁపితిని. అంత మఱికొంచెమెక్కినది. చిక్కినది జాఱిపోకుండ లోతొడలతో బిగియించి పట్టితిని.

నాకాసుఖ మెంతకాలమో నిలువలేదు. లోననుండి జిలజిలమని తడిపోచ్చె, లేడిశిశ్నము ముడుచుకొనిపోయినది. అంతనది దిగి యేమియు నెఱుంగనిదానివలె దానితోవ నది పోయినది.

నాకు మాత్రమేమాత్రమును దృష్టిదీఱక నింక నాపనికే మొగము వాచితిని. మఱియొకలేడి రాదా, యని కాచుకొనియుంటిని.

నానోము వేయిరెట్లుగ ఫలించినది. వచ్చినది, నోరెఱుఁగని జంతువుకాదు. జవసత్వములూరుచున్న యువకుండు. వేఁటకై వచ్చిన వాఁడుగాఁబోలు వెంట జాగిలమున్నది. ఆతనిఁజూడగానే నాకెక్కడలేని భయముగలిగినది. దిసమొలతో నున్నాను. ఏమనుకొనునో! ఏమిచేయునో. ఒంటరిగాఁ జిక్కితిని. కూఁకవేటు దూరంబున నెవ్వరునులేరు: నాచీరెయు అవికయు నెచ్చటనో యావలనున్నవి.

ఏమియుఁదోఁపక నటులనే నిలుచుంటిని, ఆతఁడు సమీపించుచున్న కొలఁదిని నాకు కంపమెక్కువైనది.

'నీవు వనకన్యకవా?'

ఆతనియూర్పు నాచెంపలదాఁకుచున్నది. ఏమియుఁ జెప్పనోరాడక కనులుమూసికొంటిని.

'ఎవరైనను నిన్నువదలను' అనుచు, నా చన్నొడిసిపట్టి రెండవ చేయి నడుముమీఁదుగావైచి దగ్గరకులాగుకొని పెదవికొఱికినాఁడు. నాకాచురుకులో బాధకన్న తీయందనమే యెక్కువగాఁగానుపించినది. ఆతని నల్లుకొనిపోవు తీవవలె చేతులు మెడకుపెనవైచితిని.

దేహంబు లొకటికొకటి హత్తుకొనిపోయినవి. నాతొడలసందున కేదియో నిలువుగా నుబుకుచుఁ దగిలినది. ఆస్పర్శతో కలవరమంది కౌఁగిలి విడిచితిని. ఆతఁడునవ్వుచు, నిలుచున్నచోటనే కట్టుబట్ట దిగవిడిచినాఁడు. బొకుపిడివంటిది, నిగుడియున్నది. అదికొంచెము పైకినిక్కుచు నన్నుబిలచుచున్నటులఁ దోఁచినది. అంతటితో నాసిగ్గు పటాపంచలైనది.

ఒక్కగంతులో దగ్గఱంజేరి యాచిఱుతరోకలిని చేతనందుకొనఁజూచితిని గాని యది యిముడలేదు, చేతనిముడుటలో పైచర్మము వెనుకకు పోయి, మంచులోఁదడిసిన మందారపువ్వువంటి ద్రివసహితమైన యెఱ్ఱని తల చిఱుపెదవులతో వెలికివచ్చినది. ఆతడి నాచేతికంటినకొలఁదిని, నాభగము మఱింత యూటలూరసాగినది.

ఈసందర్భోత్సవములో నేనుండి యాతఁడేమి యొనర్చుచున్నది గమనించుటలేదు గాని, గుబ్బలు గోరులుదిగునట్టుగా పట్టుకొని పెదవి కందిపోవునట్టుగా ముద్దిడుకొనుచు, క్రిందకుఁ బడద్రోసినాఁడు. పాదముల వద్ద గూర్చుండి తొడలు విడదీసి, లోనికిజరిగి, భగము పెదవులయంచున నాపాలిటి యమృతదండంబును దాకించి పెదవులు చేతులతో విడఁదీయుచు మెల్లగాఁద్రోయ మొదలిడినాఁడు. అతఁడటుల జేయుచున్నకొలఁదిని మేనుమఱువంజొచ్చిన పారవశ్యములోనే వింతపడంజొచ్చితిని. 'నా కంత రంధ్రమున్నదా! బడితెవలెనున్నదే! దానినంతయు ద్రోయవలెనన్న నెటులఁబట్టునో?' ఇంతలో దానిపనియది జూచుకొనుచునేయున్నది. లోనికి దొచ్చుకొనుచున్నకొలంది, యున్నలావుచాలక కాబోలు నింక పెరుగుచున్నది.

ఆవంచకుఁడటుల నెమ్మదిగా ద్రోయువాఁడటులనేయొనరింపక నొక్కతోపుతో సరాసరి దానినంతయూ దూర్చినాఁడు. నొప్పిచే కెవ్వుమని యదిచి వదలించుకొన జూచితినిగాని, యాతఁడు నాచనుల గుత్తంబుగాఁబట్టుకొని, యింకనేమైన రవంతమిగిలియున్నదేమో దానిని గూడ నెట్టినాఁడు. మాయిరువురి శేష్పమహారణ్యంబులు నేకములైనవి.

వెనుకకు క్రమముగాలాగి,యూఁపుగా ముందఱకు నెట్టుచున్నాఁడు. ఒకొక్కతాఁకు నాకు బొడ్డుపకుఁదగులుచున్నది. 'నొప్పి' యని కేకలు వేయుచు గునియుచునుంటినేగాని భగమున నిరుకుకొనినదానిని వదలించు కొనవలయునని లేదు. క్రిమముగా బాధ పులకరింతగామాఱినది. ఆతని మెడకు చేతులులంకెలువైచి మీఁదకులాగుకొని యదిమిపట్టితిని. ఆతఁడు 'యిప్పు డెట్టులనున్నది. ఇంకనూ ద్రోయనా యీయూపు

చాలునా?' యని నవ్వినాఁడు. నేను చిఱునవ్వుతో భగము పెదవులతో నాతని కామదండమును జవ్వరించి లోనికి లాగుకొంటిని. ఇంక రెట్టించిన వేగముతోఁ గుమ్ముటప్రారంభించినాఁడు. అబ్బబ్బ! ఆపోటులయందలి కమ్మందనమేమనను?

అటు లెంతసేపుంటిమో, కొంతతడవున కాతఁడు నాయోనిలో జలజలఁగార్చి, దండంబును వెనుకకులాగికొని లేచినాఁడు. అదితొలుతటి వలె బిఱ్ఱబిగిసియుండక వ్రాలిన ధ్వజస్తంభంబువలె నున్నది. దానింజూడఁగనే నాకింకను దమితీఱక భగము గులగులలాడఁ జొచ్చినది.

'ఇంకొకమాఱు' యంటిని. ఆతఁడు, 'నాకుచాలును, నీకువలయు నో నిదిగో, దీనిని లేపికొని పట్టినంతవఱకు దూర్చుకొనుము' అని నాసరసను వెల్లికిలఁబండుకొని, తనమీఁదికి నన్నులాగుకొనినాఁడు. నా భగము చెమ్మ మొనకుఁదగులుటతోడనే యాతనిశిశ్నము మఱల నిటారున గడ వలెలేచి, కన్నంబు వెదకుకొని జొరబడినది. నేను, నడుమునూపుచు, నాతనికన్న నెక్కుడు తీవ్రముగా లోనబలుకదురునటుల రమింపఁజొచ్చితిని. ద్రవమూరుటచే, ముందుచకన్నినిప్పుడు కొంచమువదులై, లింగము తేలికగాబోవుచున్నది. నాకాలావు చాలదు. ఎటులనా యనుకొనుచుండఁగనే నాపాలివేల్పులు వరమొసంగినటుల నాతని జాఁగిలము నామీఁదకెక్కి, వెనుకనుండి దానిమేఢ్రమును దూర్చినది. అదిమాత్రము లావుతక్కువా? యీరెండునిముడక నాభగము చినిఁగిపోవునేమో యనుకొంటిని, కాని, దాని కవొకలెక్కా? ఎన్నిశిశ్నంబులైన యవలీల దిగమ్రింగగలదు.

ఇఁక, జమిలిరోఁకళ్లపోటు తగిలినది. వెనుకను జాఁగిలము, ముందు నాతఁడు. ఎంతసేపని, యెంతబిగుతుగానని? నాజన్మమున కెన్నఁటికిని నప్పటిసుఖము మరువలేను. [సశేషము.]

ఎనిమిదవ గ్రంథము.

# నాగరసర్వస్వము.

బౌద్ధభిక్షువు పద్మశ్రీ రచియించినది.

మహారాజు జగజ్జ్యోతిర్మల్లుని సంస్కృతవ్యాఖ్యతో, విశేషార్థములను, సంప్రదాయములను విశదీకరించు ఆంధ్ర వివరణముతో బ్రచురితమగును.

• వాత్స్యాయనాది కామశాస్త్రప్రణేతలు జెప్పకవిడచిన కామవ్యవహారసంకేతనము లీగ్రంథమున మాత్రమేకలవు. అనేక నూతనవిషయముల నెఱిఁగించు, కూలంకషమగు రతిశాస్త్రము.

• స్ఫుటముగా బంధవిధానములఁ బ్రదర్శించు చిత్రములు.

అనుబంధము.

# నాగార్జునకక్షపుటము.

• తంత్రాచార్యుఁడగు సిద్ధనాగార్జునుఁడు కృపచేసిన తంత్రరాజము. వందలకొలఁది యనుభవయోగము లీయౌపనిషదిక గ్రంథమునఁగలవు. ఈ విషయమున దీనిని మించునది మఱియొకటిలేదు.

కామగ్రంథమాల. పుదుచ్చేరి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA1123 184 |
| పుస్తకం పేరు | 0<br>బ్రహ్మానందలోకము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 48 [61,101,122 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navta |
| పేజీలు విడదీసినది | Thaji |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |